# పూర్వ భారత కార్మికులు



★

రచన:

డా॥ కృష్ణమురారి శర్మ — ఎం. కాం., డి. ఫిల్.

★

అనువాదం:

శ్రీ వే. విశ్వనాథశాస్త్రి, బి. ఏ.

★

ప్రచురణ: 33

దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాదు.

కష్ట జీవులకు



## రచయిత పరిచయం

1. జననం : 30 జనవరి 1931
2. చిరునామా : C/o శ్రీ. ఎల్. యస్. శ్రీవాస్తవ<br>147, సుభాష్‌నగర్, అలహాబాదు (యు.పి.)
3. కార్యకలాపాలు : పఠన
4. అభిరుచి : చరిత్ర, సాహిత్యం.
5. రచనలు :—

ముద్రితం :
1. Economics in joint authorship.
2. Economic Geography of India.
3. Labour in Ancient India.

అముద్రితం :
1. Productivity movement in India.
2. Productivity measurement.

6. అభిమాన రచయితలు : ప్రత్యేకంగా ఎవరూ లేరు.

# తొలి పలుకు

*

ప్రాచీనభారతదేశములో కార్మికుల కార్యనిబంధనలు, జీవన విధానాలను గురించిన విషయముగురించి నేనే ప్రధమంగా వ్రాస్తున్నా నేమో చెప్పలేను. ఆసక్తిదాయకమైన యిట్టివిషయాన్ని గురించిన పరిశోధన యింతవరకు వెలువడకపోవడమే నా యీ ప్రయత్నానికిగల కారణాలలో ఒకటి. ఇంతవరకు ముఖ్యంగా భారతదేశములోని మతము, తత్వశాస్త్రము, కళ, సాహిత్యము, రాజ్యాంగము పైనే పరిశోధనలు జరిగినవి గాని, కార్మిక రంగముపై పరిశోధనకు గల అవకాశాల పైపుకు ఎవ్వరూవెళ్లలేదు. ఇందువల్లనే యిప్పుడు నా యీ పూనిక.

ఇటువంటి చారిత్రక విషయాలలోనికి దూరంగా వెళ్లినవారికి వీటిరచనలు చేయడంలో వుండే సాధకబాధకాలు, పరిమితులు బాగా తెలుసును. ముఖ్యంగా పురాతన సంస్కృత గ్రంథాలకు సరియైన టీకా చెప్పడమనేది చాలాకష్టమైనపని. ఒకే పాఠానికి వివిధ విద్వాంసులు చెప్పే అర్థాలు తరుచు వేరువేరుగావుంటాయి. విభిన్నమైన అర్థాలు ఒకే సందర్భానికి అనుకూలంగా వుండే పరిస్థితులు మనకు తగులుతాయి. అటువంటప్పుడు ఏ వ్యాఖ్యానము సత్యానికి యించుమించుగా వుంటుందో పరిశోధకుడు తనకు తానే నిర్ణయించుకోవలసి వుంటుంది.

పురాతన సాహిత్య, శాసనిక గ్రంథాల కాల నిర్ణయం యిదమిత్థంగా తేల్చుకోలేకపోవడం మరొక యిబ్బంది. చరిత్రకారులు అనేక విధాలుగా కాలనిర్ణయంచేయటంతో అస్పష్టత ఆవిర్భవించి అందరిని గందరగోళంలో పెడుతుంటాడు. ఉదహరణకు చెప్పాలంటే యిప్పటికి అనేక గ్రంథాల పరిశోధన జరిగినా వేదకాలము ఎవడప్పుయిందీ సరిగ్గా

ఎవ్వరికీ తెలియదు. ఓల్డెన్‌బర్గ్ వంటి అధికారిక చరిత్రకారుడు క్రీ. పూ. 1200 వేదకాలమని చెప్పినాడు. జాకోబి ప్రకారం క్రీ. పూ. 3000-2000 మధ్య వేదకాలం. అయితే వింటర్నిట్జ్ క్రీ. పూ. 2500 సరియైన కాలమన్నాడు, హాగ్ అంచనాల ప్రకారం యిది క్రీ. పూ. 2400 నుండి 2000 వరకు వున్నది.

క్రీ. పూ. 321-300 మధ్య రచింపబడినదిగా చెప్పబడుచున్న కౌటిల్యుని 'అర్థశాస్త్రము' గురించి యిదే విధంగా భేదాభిప్రాయం వున్నవి. డాక్టర్ హిల్లిబ్రాంట్, డాక్టర్ వింటర్నిట్జ్‌లు 'అర్థశాస్త్రము' కౌటిల్యునిచేత గాక ఆయన శిష్యులచేత రచింపబడిందనీ, కాబట్టి దాని కాలము క్రీ. శ. 300 ప్రాంతంలో వుంటుందనీ అన్నారు. 'అర్థశాస్త్రము'లో కొన్ని సందర్భాలలో కౌటిల్యుని పేరు మధ్యమ పురుషములో పేర్కొనబడుటయే వీరి అభిప్రాయానికి ఆధారము. అయితే అర్థశాస్త్రము యొక్క అంతర్గత విషయములను కొంత సావకాశంగా చదివితే అర్థశాస్త్ర కాలము చంద్రగుప్త మౌర్యుడు సింహాసనమునధిష్ఠించిన కాలముతో సరిపోతుంది గాబట్టి పై అభిప్రాయము నిరాధారమైనదని చెప్పవచ్చును. మనుస్మృతి రచింపబడిన కాలమును గురించిగూడ యిట్టి అనుమానాలున్నవి. ప్రొఫెసర్ జాల్లీ యీ గ్రంథము క్రీ. శ. రెండవ లేదా మూడవ శతాబ్దము మించకుండా వ్రాయబడిందని చెప్పగా ప్రొఫెసర్ బహ్లూర్ అది క్రీ. పూ. 200 నుండి క్రీ. శ. 200 మధ్య వుంటుందని అన్నాడు. ఇట్టి అయోమయ పరిస్థితి చారిత్రిక విషయాల గ్రంథకర్తలకు పెద్ద సమస్యగా పరిణమిస్తుంది. సత్యానికి దరిదాపులలో వున్నదని నామనస్సుకు తోచిన కాల పట్టికను నేను సమర్పించినాను. ప్రొఫెసర్ జాల్లీ, ప్రొఫెసర్ బహ్లూర్, శ్రీ కానే గార్లపై ఎక్కువగా ఆధారపడి యీ కాలనిర్ణయము చేసినాను.

ఈ విషయముపై ముందుముందు యింకా పరిశోధనలు జరుగటానికి యీ పుస్తకము వుపయోగపడితే నా ప్రయత్నమునకు తగిన ఫలితం లభించిందనుకుంటాను.

నా యీ సాధనలో వెలుగుచూపిన వివిధ సంహితల, ధర్మసూత్రాల, స్మృతి కర్తలకు, యితర చారిత్రిక గ్రంథాలకు నేను ఎంతో ఋణపడి వున్నాను. ఈ కార్యమునకు నన్ను ప్రేరేపించి, ప్రోత్సహించిన మిత్రులకు ముఖ్యముగా శ్రీ వేదానంద్, శ్రీ వై. ఎస్. నాయక్, ప్రొఫెసర్ ఎస్. బి. వార్ష్ణేకర్ గార్లకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. అయితే డాక్టర్ ఎం. ఎం. మెహతా, డి. ఫిల్., డి.లిట్ (ఆనర్స్) గారి ప్రోత్సాహము, సహాయములేకుంటే యీ గ్రంథమును పూర్తి చేయలేక పోయేవాడిని. కాబట్టి ఆయనకు నేను విశేషంగా ఋణగ్రస్తుడనయ్యాను. ఈ పుస్తకములో తెలుపబడిన అభిప్రాయాలు ఆలోచనలు అధికారికముగావని, నా స్వంతమని తెలుపుకోవటం అవసరమని భావిస్తున్నాను.

నాగపూరు
1 జనవరి 1957

కె. ఎం. శరన్

## తెలుగు గ్రంథానికి పరిచయం

ఇది "Labour in Ancient India" కు తెలుగు అనువాదం. దీన్ని ఇంగ్లీషులో రచించింది నా భర్త డా॥ కే. ఎం. శరన్.

ఆంగ్లంలో ఈ గ్రంథం అద్వితీయమైనదిగా గణుతికెక్కింది. ఈ విషయంపై రచన సాగించడానికి ఇంతవరకు ఎవరుయత్నించలేదు.

ఇంగ్లీషునుండి దీన్ని శ్రీ వి. విశ్వనాథశాస్త్రిగారు అనువదించారు. అనువాదపు ప్రామాణికతకు సంపూర్ణంగా వారే బాధ్యులు.

ఈ గ్రంథాన్ని తెలుగులోకితెచ్చి తెలుగు జనులకు అందజేయడానికిస్వచ్ఛందంగా పూనుకున్న దేశోద్ధారక గ్రంథమాల కార్యదర్శి శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి గారికి హార్దిక కృతజ్ఞలు.

భూపాల్
ఆగష్టు 5, 1960

కుసుమలత శరన్

## శ్రీ కే. సుదర్శనరెడ్డిగారు, (మో|ప్ర)



వీరు గ్రంథమాలకు రు. 101—00 లు విరాళం యిచ్చారు. వారికి మా కృతజ్ఞతలు.

# నా మాట

★

డాక్టర్ కె. ఎం. శరణ్ ఆంగ్లములో రచించిన "Labour in ancient India" పుస్తకాన్ని తెలుగులోకి అనువదించే సాహసం నేనుచేయటానికి శ్రీ పట్టికోట ఆళ్వారుస్వామి ప్రేరేపణయే కారణం. సామాన్య ప్రజల నిత్యావసరాలతో ముడిపెట్టుకున్న సాహిత్య సృష్టి చేయడంలో శ్రీ ఆళ్వారుస్వామి గారికి ఆసక్తి మిక్కుటము. ఈఉద్దేశ్యముతో ఆయన నవరచయితలను ప్రోత్సహించడం అందరూ యెరిగినదే. రచనలు చేయడంలో కొంగ్రొత్తవాడినైన నన్ను వీరు అనేక విధాలనచ్చజెప్పి, ఉత్తేజపరచి, సాయపడి రచనా ప్రపంచంలోకి తోశారు. వారికి నేనెంతో కృతజ్ఞుడను.

ప్రథమ ప్రయత్నంలోనే పరిశోధక గ్రంధమును చేపట్టుటకు నేను సమ్మతించడము ఈ గ్రంథముయొక్క ప్రతి పుట నన్ను ఆకర్షించడము వల్లనే. అయితే ఆంగ్ల గ్రంథమునకు ఎంతవరకున్యాయం చేశానన్న సంగతి పాఠకులే నిర్ణయించాలి. ఏమైనా ఒక అజ్ఞాత విషయాన్ని సోదరుల సమక్షంలో ఉంచగలుగుతున్నాననే తృప్తి నాకుకలుగుతున్నది. పాఠకులకు సయితము బోధపడాలనే ఉద్దేశ్యంతో సాధ్యమైనంత వరకు సాధారణశైలిని వుపయోగించ ప్రయత్నించాను. ఆశయపూర్తిలో ఎంతవరకు కృతకృత్యుడ నైనానో, నా తప్పొప్పులేమిటో తెలిపి నన్ను కృతార్థుని చేయాలని పాఠకులను ప్రత్యేకముగా కోరుచున్నాను

నా చిత్తు అనువాదమును శ్రద్ధతో విని నాకు ఆత్మసంతృప్తి కలిగించిన మిత్రుడు శ్రీ బి. హీరోజీరావుకు, అనేక యితరవిధాలుగా తోడ్పడి, ప్రోత్సహించిన యితర సహచరులకు కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటున్నాను.

నా యీ సాహసానికి రూపధారణ చేసిన దేశోద్ధారక గ్రంథమాలకు నాధన్యవాదములు.

సికిందాబాదు.
20-7-1960.

వే॥ విశ్వనాథశాస్త్రి.

# మనవి

మన ప్రాచీన భారతదేశం గురించి ఎంతో పరిశోధన జరిగి, ఎన్నో గ్రంథాలువెలువడ్డాయి. ప్రాచీన సంస్కృతి, కళలు, సాహిత్యము, చరిత్ర, ఆర్థిక, రాజకీయాలను గురించి వివిధరీతుల రచనలు సాగాయి. కాని కార్మికులసమస్యలు, వారి ఆర్థిక, సాంఘిక సమస్యలను గురించి నేటివరకు ఏలాంటి పరిశోధన గాని, అదృష్టవశంతో బయటబడ్డవిష యాలుగాని ఇంచుమించులేవని చెప్పవచ్చును. శ్రీ కె. ఎం. శరణ్గారు చాలా శ్రమించి, ఈవిషయమై సమగ్రమైన థోగట్టాను "Labour in ancient India" అనుపేర గ్రంథరూపంలో అందించారు. ఆ గ్రంథాన్ని తెలుగుపాఠకులకు అందించాలని ఉత్సాహపడి, గ్రంథకర్తను అర్థించగానే, దయతో వారుఅంగీకరించారు. శ్రీ వేదాంతం విశ్వనాథ శాస్త్రిగారు పట్టుదలతో అనువదించి, సకాలంలో అందించారు. అదే విధంగా ఎందరో మిత్రులు సహృదయంతో తోడ్పడ్డారు. ఆర్థికంగా సాయపడ్డారు. వారందరికీ మా హృదయ పూర్వక కృతజ్ఞతలర్పించు కుంటున్నాము.

సదా మీ సహకారాభిలాషి,
విన్నవించు
వట్టికోట ఆళ్వారుస్వామి
కార్యదర్శి.

# విషయ వివరణ

# కాల పట్టిక

వేద పూర్వయుగం — క్రీ. పూ. 3000 కు పూర్వం

వేద కాలం — క్రీ. పూ. 3000 – క్రీ. పూ. 1400

బ్రాహ్మణములు — క్రీ. పూ. 1400 – క్రీ. పూ. 1000

శ్రౌత సూత్ర, ఉపనిషత్తులు — క్రీ. పూ. 1000 – క్రీ. పూ. 400

గౌతమ, బౌద్ధాయ యాన ధర్మసూత్రములు — క్రీ. పూ. 600 – క్రీ. పూ. 400

ఆపస్తంభ, వశిష్ట ధర్మసూత్రములు — క్రీ. పూ. 500 – క్రీ. పూ. 400

కౌటిల్యుని అర్థశాస్త్రము — క్రీ. పూ. 320 – క్రీ. పూ. 300

మనుస్మృతి — క్రీ. పూ. 300 – క్రీ. పూ. 200

యాజ్ఞవల్క్యస్మృతి — క్రీ. శ. 100 – క్రీ. శ. 300

విష్ణుస్మృతి — క్రీ. శ. 200 – క్రీ. శ. 400

నారదస్మృతి — క్రీ. శ. 400 – క్రీ. శ. 600

బార్హస్పత్యస్మృతి, కాత్యాయనస్మృతి — క్రీ. శ. 400 – క్రీ. శ. 650

శుక్రనీతి — క్రీ. శ. 750 – క్రీ. శ. 850

# ఒకటవ అధ్యాయము

## ప్రాచీన భారత సామాజిక వ్యవస్థ, వృత్తులు



ప్రాచీన భారత దేశచరిత్ర ఒక మనోహరమైనగాథ. విజ్ఞానం, కళలు, సాహిత్యం - యీ మూడింటి వికాసానికి మిక్కిలిగా దోహదం కలిగించి భారత, చైనా, ఈజిప్టు దేశాలు నాగరికతకు, సంస్కృతికి ఆలవాలమై అలరారినవి. అందులో భారత ప్రవక్తలు సాంఘిక, భౌతిక విజ్ఞానశాస్త్రములకు చరిత్రాత్మకమైన సేవజేసి యీనాడు దుస్సాధ్యమనుకునే అనేక సమస్యలను అకాలంలోనే పరిష్కరించ గలిగారు.

ఒకవేపు ఆధ్యాత్మికంగా అమూల్యమైన వృద్ధిజరుగుతున్నప్పటికీ మనపూర్వులు భౌతికమును త్రోసిపుచ్చియుండలేదు. వారు వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యం - యిత్యాది రంగాలలో ఎంతో ఉన్నతస్థానంలో వుండేవారు. వ్యవసాయశాస్త్రాన్ని అనేకవిధాలుగా అభివృద్ధి జేయటమే గాక యితరకళలను గూడ కరతలామలకం చేసుకున్నారు. ప్రాచీన ఇండో-ఇరానియన్ కాలమునకు జెందినదని చెప్పబడుతున్న (నాగలి కళ) వ్యవసాయం ప్రాచీన భారతంలో మూడు పువ్వులు ఆరుకాయలుగా వికసించిందని చరిత్రకారులు ఏకకంఠంతో అంగీకరిస్తున్నారు. మన దేశంలో పండింపబడినట్టి వివిధ ధాన్యాదినుసులను గురించి హ్యూయన్ సాంగ్ చెప్పినకథనం యీ అభివృద్ధికి విశ్వసనీయమైన ఋజువుగా

వున్నది. అంతేగాక కౌటిల్యుని అర్థశాస్త్రములోనూ యితర మత గ్రంథ ములద్వారానూ ఇందుకు సంబంధించిన సాక్ష్యాలు లభిస్తున్నాయి.

భారతదేశం చైనా, ఇండో-చైనా, గ్రీసు, రోమ్ దేశాలతో సముద్రయానంద్వారా విదేశవ్యాపారం సాగించిందని చరిత్రవలస తెలు స్తున్నది. ఆసియా మైనర్‌తోనూ సమీపపశ్చిమ దేశాలతోనూ రాజకీయ, వ్యాపారసంబంధాలు కలిగివున్నట్లు అశోకుని స్థూపాలు తెలుపు తున్నాయి.

క్రీ. శ. ప్రథమ, ద్వితీయ శతాబ్దాలలో ఇండియా-రోమ్‌ల మధ్య వ్యాపారం జరిగినట్లు ప్లినీ, టోలెమీలు నుడివి నారని వి. ఎ. స్మిత్ వ్రాసిన హిందూదేశ చరిత్రలో వున్నది.[1] వాత్స్యాయన కామసూత్ర ముల వ్యాఖ్యానకారుడు చక్లధర్ ఫాహియాన్ మనదేశం వచ్చిననాటికే మన విదేశవ్యాపారం వున్నతస్థాయిలో వుండేదనే స్వియావికి వచ్చాడు.[2] మగధ చక్రవర్తుల కాలంలో బర్మా, మలయా, సిలోన్ లకు వ్యాపార యాత్రలు జరిగినట్లు, ఋగ్వేదకాలంలో మనకు విదేశా లతో వ్యాపారసంబంధాలు వుండినట్లు సాక్ష్యాలు లభిస్తున్నాయి.[3] పూర్వం హిందువులు పెనామా కాలువప్రాంతంలో వ్యాపార కలాపాలు సాగించిన వైనాన్ని "హిందూ-అమెరికా" అనేయిటీవలి పుస్తకం తెలుపుతున్నది. ప్రాచీన భారతదేశచరిత్ర గురించి అధికారికంగా వ్రాయబడిన గ్రంథాలలో యిందుకు యింకాఅనేక సాక్ష్యాలున్నాయి.[4,5]

మోహంజోదారో, హరప్ప, కౌశంబి త్రవ్వకాలలో వెలికితీయ బడిన మనప్రాచీన నాగరికతాశిథిలాలు, దేశవ్యాప్తంగా కనిపించే చెక్కడాలు, మనదేశంలో కంసాలి, వడ్రంగి, కమ్మరి, దంతపువని, కుమ్మరి, నూలుతీయుట, నేత మొదలైన పరిశ్రమలు విశేషంగా అభి వృద్ధిగాంచి యుండినవని తెలుపుతున్నాయి. క్రీ. పూ. 320 నాటికే యీ

పరిశ్రమలు బాగాపైకివచ్చినట్లు కౌటిల్యుని అర్థశాస్త్రముద్వారా తెలుస్తున్నది. మస్లిన్, క్యాలికో, లినెన్, వున్ని పడకుట, నేయుట క్రీ. శ. ఏడవ శతాబ్దములో విరివిగావుండినట్లు హ్యూయన్ సాంగ్ రచనలలో పేర్కొనబడివున్నది క్షౌమ, జాతిపత్రిక, చిత్రపట, అంశుక, లలాటంతు, నేత్ర, ద్యుకుల, పుష్పపట్ట, పూలఖర్ద మొదలైనవట్లు, నూలు బట్టలపేర్లు బాణభట్టు తనకావ్యములలో వాడియున్నాడు. విభిన్న సమయాలలో విభిన్నఅవసరాలకు వుపయోగించు వస్త్రములను, వాటిని తయారుజేయుటకు కావలసిన వస్తువులను గురించి అమరకోశములో వ్రాయబడియున్నది. గుప్తవంశమునాటి కట్టడములు, రాతిచెక్కడములు, ఢిల్లీలోని ఇనుపస్తంభము అప్పటి కమ్మరివారు, రాతిపనివారు తమ విద్యలోగడించిన వుత్తమస్థాయిని చెప్పక చెప్పుతున్నవి. ప్రాచీన భారతంలో వికసించిన కళల ఔన్నత్యాన్ని "వృత్తిసంఘాలు" చూపెట్టుతున్నాయి. ఈ వృత్తిసంఘాలను గురించి మరో అధ్యాయంలో వివరించబడుతుంది. శాతవాహనుల కాలానికిచెందిన సాక్ష్యాలవలన "పంపుయింజెన్లు" వాడకంగూడ ఆకాలంలోవుండేదని విశదపడుతున్నది. మౌర్యుల కాలంలో శస్త్రాలతయారీ, బంగారు పుతాలతోగల బట్టలు నేయడం, నౌకానిర్మాణం గురించి గ్రీకు గ్రంథకర్తలు విపులంగా చెప్పియున్నారు.

ఇంతటి అభివృద్ధి ఆనాడు ప్రబలంగాపున్న వర్ణవ్యవస్థ ఆధారంగానే జరిగిందని విశ్వసించబడుతున్నది. ఎందుకంటే యీ వర్ణాలు వృత్తులవారిగా వెలసి వివిధకళలలో విశేషనైపుణ్యం సంపాదించిపెట్టడానికి, ఆనైపుణ్యాన్ని వంశపారంపర్యంగా పోషించుకుంటూ వృద్ధిజేసుకోవడానికి దోహదంయిచ్చాయి. కాబట్టి యీవర్ణవ్యవస్థను పరిశీలించి, యీవ్యవస్థ ఏ ఆశయసాధనకు వుపయోగించిందో తెలుసుకోవడం మిక్కిలి అవసరం.

# 2

## సామాజిక వ్యవస్థ

ప్రాచీన హిందూసమాజం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాల్గు ముఖ్యవర్ణములుగా విభజింపబడిందని అందరికి విదితమే. అప్పటిజాతి, వర్ణ వైముఖ్యతవలన ఆర్యులు తమకుతాము తెచ్చిపెట్టుకున్న దైవజ్ఞతవలన యీ చాతుర్వర్ణ్య సిద్ధాంతము రూపొందింది. మొట్టమొదట ఆర్యులు, అనార్యులు (దాస్యులు) అను రెండే తెగలుండేవి. నలుపు శరీరంగల ఆదిమజాతివారిని అనార్యులన్నారు. ఆర్యులకు వీరు బద్ధవిరోధులు (ఋగ్వేదం I_51.8; VII_6.3 మరియు మైత్రేయ సంహితం VI_3.11.3). కాని పురుషసూక్తం (ఋగ్వేదం-X) వ్రాయబడేనాటికి ఆర్యులే మూడువర్ణములుగా విభాగింపబడ్డారు. ఈ విభజన - బ్రాహ్మణ, క్షత్రియ, శూద్రులు-అధర్వణ వేదంలోగూడ పేర్కొనబడింది. "బ్రాహ్మణుచే నిజంగా అమెభర్త, రాజన్యుడుగాని, వైశ్యుడుగానికాదు" 6 (V_17.9). కాలక్రమేణా అనార్యులలో కొందరిని ఆర్యవ్యవస్థలోనికి తీసుకోవడం జరిగి వీరిని శూద్రులు[7]ని పిలిచేవారు. శూద్రులనగా ఏకజులు. ద్విజులైన ఆర్యులవలె పవిత్రమైన దైవజ్ఞానం పొందే అర్హతకుగాని స్వతంత్రమైన ప్రతిపత్తికిగాని, అవకాశాలకుగాని వీరు నోచుకోలేదు. రానురాను యీ నాలుగు వర్ణాలు మానవుని వికాసముయొక్క నాలుగు అంతస్థులుగా చెప్పుకోబడుతూ వచ్చినవి. పాండిత్యము, జ్ఞానముకలిగినవాడు బ్రాహ్మణుడు; ధైర్యసాహసములు కలిగి కార్యశూరుడైనవాడు క్షత్రియుడు; వణిజులు, కృషీవలురు వైశ్యులు; నడుమువంచి పనిచేసేకార్మికులు శూద్రులు; అనిచెప్పుకోబడేవారు. ఈ విభజన జరిగినప్పుడు కులాలు, తెగలు అనేవిలేవు. పైగా మనుష్యుని పుట్టుక ఆధారంగా అతనికి సమా

జంలో స్థానం యివ్వటమనేది అప్పుడులేదు. ఆకాలంలో ఒకవ్యక్తి శూద్రుడుగా పుట్టినప్పటికీ యజ్ఞోపవీతధారణంతో అతడు ద్విజుడుగా మారే అవకాశంవుండేది. ఇంకాఅతను కష్టించిచదువు, సంధ్య, జ్ఞానం, ఆధ్యాత్మిక చింతన ఆర్జించినచో అతడు బ్రాహ్మణుడు—నిష్కళంకుడు—అగుటకు వీలుండెను. మహాభారతంలోని శాంతిపర్వంలో యీవిధంగా చెప్పబడియున్నది. "పవిత్రుడై, జపతపాది అనుష్ఠానాలవలన శుద్ధుడై వేదాభ్యాసంచేయువాడై, నిత్యపారిశుధ్యకర్మల నాచరించువాడై, దైవ నైవేద్యమునారగించువాడై, మతగురువు నంటియున్నవాడై, సత్య సంధుడై యున్నవాడే బ్రాహ్మణుడు, పాలకధర్మము నాచరించువాడు, వేదపఠశము చేయువాడు క్షత్రియుడు. వర్తకము, భూసేద్యము, పశువుల పెంపకము. ధనార్జనచేయువాడు, నిష్కళంకుడు వేదపఠనములో పరి పక్వము చెందినవాడు వైశ్యుడు. అన్నిరకాల తిండితినువాడు, అన్ని రకాలపనిచేయువాడు, అశుచియైనవాడు, వేదాలను త్రోసిపుచ్చినవాడు, పవిత్రధర్మములను పాటించనివాడు శూద్రుడు. ఈ లక్షణములు శూద్రు నిలోగాక ద్విజునిలో గన్పించిన యెడల అట్టిశూద్రుడు శూద్రుడుగాడు, అట్టి బ్రాహ్మణుడు బ్రాహ్మణుడుగాడు" (189: 2-8). ఈ విధమైన శ్లోకాలు భగవద్గీతలో గూడవున్నాయి. (18వ అధ్యాయం, 41-44 శ్లో) తైత్తరేయసంహితంలోని "ఏషవై బ్రాహ్మణఋషిరార్షేయోయః శుశ్రు వను" (6.6.1.4) అనుపంక్తి, మైత్రియనేయ సంహితంలోని "కిం బ్రాహ్మణస్య పితరం కిము పృచ్ఛ సిమాతరం I శ్రుతం చేదస్మిన వైద్యం సపితాసపితామహః" (48.1; 107, 9) అను శ్లోకం కూడ సమాజంలో మానవునికి స్థానం కల్పించేది అతని గుణమే గాని పుట్టుక కాదు అని ఋజావు పరుస్తున్నవి. కాబట్టి గురు, రక్షక, పారిశ్రామిక, శారీరక ప్రవృత్తులను ప్రతిబింబించే యీ నాల్గు వర్ణములు ప్రజలు తమ జీవనో పాధికై అనుసరించే వృత్తులమీద, వారి సాంఘిక, సాంస్కృతిక, వైజ్ఞా

విక స్థాయిమీద ఆధారపడి యేర్పడినట్టివేయని యీ సమస్యపై జరిగిన వివిధ పరిశోధనలవలన తేటతెల్లమగుతున్నది.

సమాజాన్ని యీ విధంగా విభజించడములోని జ్ఞానసూక్ష్మతను, అందులోని ఆశయమును మనము సులభంగా గ్రహించవచ్చును సమాజానికి దారిచూపే సారథులు, అధికారం నడిపేశక్తి, దాని అవసరాలను తీర్చేందుకు కర్షక, పారిశ్రామికులు, వర్తకులు, శరీర రక్షణచేసేవారు యెల్లప్పుడూ అవసరమే. ఈ నాలుగు విధాలుగానూ ప్రాచీన సమాజానికి సేవజేసేవారినే బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు శూద్రులు [8, 9] అని పేర్కొన్నారు. ఇంతకన్న ప్రత్యేకమైన విభజన అప్పటిలో బహుశః లేకుండెను.

ప్రజలయొక్క సాంఘిక అంతస్తులు, వారి వృత్తులు నిర్ణయించటంలో పుట్టుకకు ప్రాధాన్యం యివ్వటం మొదలయిననుంచి కులాలు, తెగలూ పెరుగుతూ వచ్చాయి. సాంఘికనాయకుల, ముఖ్యంగా బ్రాహ్మణుల సంకుచిత స్వభావము మూలంగానే కాలక్రమంగా వర్ణాల నుంచి కులాలకు సమాజ వ్యవస్థ దిగజారిపోయింది. దేశంపై జరిగిన ఒక్కొక్క దండయాత్రతో యీ బ్రాహ్మణుల ప్రాముఖ్యత క్షీణించుతూ వచ్చింది. ప్రసిద్ధతత్వవేత్త డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ అన్నట్లు హిందూసమాజంలోనికి శాక, యవన, పల్లవ, కుషన్ ఆదిజాతుల విలీనీకరణకు హిందువులుజూపిన అభ్యంతరములవల్లనే యీ కుల వ్యవస్థ అవతరించింది. ఇతర జాతులు హిందువులతో కలియడంతో ఎవరిదే కులమో నిర్ణయించడానికి వేరే ఆధారం లేకపోవడంవలన మనిషియొక్క పుట్టుకకు యింత ప్రాధాన్యం వచ్చింది. [10] ఈ అభిప్రాయంతో అందరూ ఏకీభవిస్తారు.

దీనికి పూర్వకాలంలో పుట్టుకకు యిట్టిప్రాధాన్యం లేనప్పుడు అనార్యులు ఆర్యులుగా మారుటకు ఎట్టి అభ్యంతరములు లేకుండెను.

సామవేదంలోని 'వ్రాత్యస్తోమ' లో యిటువంటి మార్పు జరిగే పద్ధతి గూడ వివరించబడిందని సర్దార్ కె.ఎం. పణిక్కర్ తెలుపుతున్నారు[11] మొదట ఎవరికిష్టమైన వృత్తిని వారు అవలంబించడానికి స్వేచ్ఛ వుండేది. కాని పోనుపోను కులనిర్ణయం గురించి పుట్టుకపై ఆధార పడడం ప్రారంభమయిననాటినుండి ఏవృత్తికి సంబంధించిన కులంలో పుట్టితే ఆవృత్తినే అలవరచుకోవాలనీ అందుకు నిర్ణీతమైన విజ్ఞాన వికాసాలను పొందాలనీ సూత్రీకరించబడింది. జన్మించినప్పుడు అందరు మానవులు సరిసమానులుగాబట్టి ఎవరికి రుచించిన వృత్తిని వారు చేపట్టవచ్చుననే సిద్ధాంతము యీ విధంగా నీళ్లుకారిపోయింది. అప్పటినుంచి శూద్రునికి జన్మించినవ్యక్తి, అతని నైపుణ్యమెటువంటి దైనా సరే, శూద్ర కులవృత్తి అనగా నీచకార్యములనే చేస్తూవుండవలెనే గాని ఆ పరిధిని అధిగమించుటకు వీలులేదు.

ఒకటి రెండు శతాబ్దాలలో యీ పరిస్థితి యింకా అధ్వాన్నంగా పరిణమించింది. శూద్రుడై పుట్టిన వాడు ఆజన్మాంతం నిరక్షరకుక్షిగాను, నీచ ప్రవృత్తిలోనూ కొట్టుకులాడవలసిందేగాని జీవితంలోని ఔన్న త్యాల గురించి చెప్పరాదు, వినరాదు అన్నంతగా సమాజం అతడిని బంధించివేసింది. అయితే బ్రాహ్మణుడుగా జన్మించినవాడు ఎంత నీచుడై ప్రవర్తించినా దైవాంశ సంభూతుడని, రాజులకు, చట్టాలకు అతీతుడనే భావం ప్రబలిపోయింది. ఉదాహరణకు పరాశరస్మృతిలో యీవిధంగా నుడువబడియున్నది. "బుద్ధిమంతుడైన ఉదారుడైన శూద్రునికన్న నీచుడైన బ్రాహ్మణుడే పూజనీయుడు. ఎట్లాగంటే పొగరుబోతుడైనా ఆవుపాలే తాగుతారుగాని అమాయకమయినదని గాడిదపాలు ఎవరుతాగుతారు?[12] ఇటువంటిదే వృద్ధగౌతమ స్మృతి లోనూ, మహాభారతంలోని అనుశాసన పర్వంలోనూ వుల్లేఖించ బడి వున్నది.

శూద్రునికి అంటగట్టిన దుస్థితులన్నింటిలోనూ సమాజంలో అత నికిచ్చిన స్థానం హృదయవిదారకమైనది. అతడు వేదాలు చదువ కూడదు. వేదపఠనము జరుగుతున్న దరిదాపులకు పోకూడదు.[13] ధర్మశాస్త్రములు, స్మృతులలోకంటె వేదకాలంలో అతని విషయంలో యీ కాఠిన్యం కొంత తక్కువగా వుండేది. వేదపఠనంగాని, వేద శ్రవణంగాని చేసినందుకు అతనికి విధించబడే శిక్ష అతి దారుణంగా వుండేది. శూద్రుడు అధ్యయనం చేయాలనే వుద్దేశంతో వేదశ్రవణం జేస్తే వాని చెవులలో సీసంగానీ, లక్కగానీ కరిగించి పోయాలని, వేద పఠనంచేస్తే వాని నాలుక తెగవేయాలనీ, వేదాలను కరతలామలకము చేసుకున్నట్లయితే వాని శరీరమును చీల్చి ముక్కలుగా చేయాలని గౌతమ ధర్మసూత్రములో వున్నది.[14] పురిటికి, చావుకు శూద్రుడు ద్విజుల కంటె ఎక్కువ కాలం అశుచిగా వుండాలి. శూద్రులను న్యాయమూర్తు లుగా నియమించరాదు. వారు బ్రాహ్మణులను తాకరాదు. వారికి ఉత్ తర్వర్ణాశ్రమ ధర్మాలను పాటించే అధికారంలేదు.[15] వారు కష్టించి ధనము కూడ బెట్టరాదు.[16] ఒకవేళ వారు తమ సంపాదనలో కొంత మిగిల్చి కూడబెట్టుకుంటే ఆమిగులును యితర వర్ణముల (ద్విజుల) అవసరార్థ ముపయోగించుకోవచ్చును.[17]

శూద్రుడు ఎక్కువగా చేస్తూండే మోటుపనికి ఎట్టి మర్యాద లేదు. అతడిని తిట్టవచ్చును, కొట్టవచ్చును, చంపివేయవచ్చును. అందుకు ప్రాయశ్చిత్తము అతిస్వల్పము. పిల్లిని, కాకిని, నెమలిని, కప్పను, కుక్కను, ముండెలుకను, లొండను చంపితే ఎంతపాపమో శూద్రుని చంపినా అంతేనని గౌతమ సూత్రము [18] లోనూ, ఆపస్తంభ ధర్మ సూత్రము [19] లోనూ, మనుస్మృతి [20] లోనూ సూత్రీకరించబడింది. అంతేగాక శూద్రుడు చేసే అపచారములకు శిక్ష యీవిధంగావున్నది. శూద్రుడు ద్విజ వర్ణస్థులతో కఠినంగా మాట్లాడితే వాని నాలుక కోయ

పలెను. ద్విజ వర్ణములను గాని, ద్విజులను గాని నిందించినట్లయితే ఎర్రగా కాలిన ఆరంగుళముల ఇనుపకడ్డీని అతని నోటిలో గ్రుచ్చ వలెను. బ్రాహ్మణ ధర్మములను గురించి బ్రాహ్మణులతో వాదించినచో సలసలకాగుతున్న నూనె అతని నోటిలోనూ, చెవులలోనూ పోయ వలెను.[21] కార్మికులకు యెట్టి సాంఘిక సౌకర్యాలు లేవు. అసలు వారిని గుర్తించి వారికి ప్రాముఖ్యత యివ్వటమనేదే లేదు

కులవ్యవస్థ ఏర్పడుటకు బాధ్యులెవరు అనే విషయాన్ని గురించి యీ వ్యవస్థ ఏ లక్ష్యసిద్ధికై ప్రవేశపెట్టబడిందనే ప్రశ్న గురించి వివిధరచయితలు విభిన్నాభిప్రాయాలు వెలిబుచ్చినారు. సిడ్నీలా [22], అబ్బీ డూ బోయిస్ [23], మెరిడిత్ టౌన్సెండ్ [24] లాంటి గ్రంథకర్తలు చతర్వర్ణ వ్యవస్థ యొక్క లక్ష్యాలను దృష్టిలో వుంచుకొని యీవ్యవస్థను చాల మెచ్చుకోగా. షెర్రింగ్, మెయిన్, ఫిక్ అనురచయితలు యీ వ్యవస్థలో కాలక్రమంగా వుద్భవించిన దురాచారాలను దృష్టిలోపెట్టుకొని దీనిని రకరకాలుగా తూలనాడారు. వీరిలో షెర్రింగ్ అను నాతడు యీ వ్యవస్థను "నీచాతి నీచ స్వరూపము గలది. దూరమైనట్టిది" [25] అని తీవ్రముగా ఖండించాడు "మానవ వ్యవస్థలలో కల్లా అక్రమ మైన, క్షుద్రమైన వ్యవస్థ"[26] అని మెయిన్ విమర్శించాడు. మనిషి యొక్క పుట్టుకకు అతని వర్ణ నిర్ణయములో ప్రాధాన్యము రావటము వలన వుదయించినట్టి అనేక అవగుణములు కలిగియున్నప్పటికీ వృత్తి ఆధారముగా సమాజమును తీర్చి దిద్దిన యీ చతుర్విధ విభజన యొక్క పరమార్థమును కాదనలేము. తదుపరి శతాబ్దములలో గూడ యీ వ్యవస్థ బాగానే పనిచేసింది.

# 3

# ప్రాచీన భారతంలో వృత్తులు, కార్మిక ఆధారములు

పైన చెప్పిన దానినిబట్టి ప్రాచీన భారతదేశంలో వృత్తుల విభజన స్థూలంగాయిట్లావుండేదని వెల్లడవుతున్నది (1) దైవోపాసకులు, (2) పంరక్షకులు (3) కృషీవలులు, పారిశ్రామికులు, వణిజులు (4) శారీరక కష్టజీవులు. వరుసగా యివే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులయొక్క వృత్తులు.

దైవోపాసనాది కార్యకలాపాలు బ్రాహ్మణులకు మాత్రమే జెందినవి. వారిలో ఆచార్యులు (గురువులు), అధ్వర్యులు (పూజారులు), గణికులు లేక నక్షత్ర దర్శకులు (సిద్ధాంతులు), గాయకులు, భిషకులు (వైద్యులు), ఋత్విజులు (పురోహితులు) ముఖ్యమైన వృత్తులు. ఈనాటికిగూడ యివి కేవలం బ్రాహ్మణ వృత్తులుగానే నిలిచివున్నాయి.

శరీరదార్ఢ్యము, పరాక్రమముకలిగి యుద్ధశిక్షణపొందిన వారిని క్షత్రియులనేవారు. ప్రజలను సంరక్షించుటే వారి పరమ ధర్మము. మనదేశముపై దాడులు జరిపిన కుషనులు, హూనులు, శాక్యులు, పల్లవులు కాలక్రమేణ క్షత్రియ జాతిలోకి తీసుకోబడినారు. రాజులు, రక్షకభటులు, సైనికులు సాధారణంగా క్షత్రియులనే చెప్పబడేవారు. తదుపరి శతాబ్దములలోగూడ సేనాపతి, అమాత్యుడు, ఉగ్రుడు, జీప గర్భుడులాంటి ఉద్యోగాలిష్వడములో యితరులకన్న క్షత్రియులకే ఎక్కువ అవకాశం లభించేది.

అనాదినుండి ఋగ్వేదకాలంపరకు ఆర్యులవృత్తియైన పశుసంరక్షణ భూసేద్యంచేయు వైశ్యుల కివ్వబడింది. వైశ్యులు తమ వృత్తి నిర్వహణలో భూమిలేని కార్మికుల సహాయం తీసుకునేవారు. వీరంతా

ఎక్కువగా శూద్రులు. వీరు కిసాన్, కృషీవల, వాప, ధాన్యకృత, గోపాల, అజపాల, పాశుప అనబడే కార్యములు చేస్తుండేవారు. ఈ పనులలో స్త్రీ కార్మికులుగూడ పాల్గొని తమ పురుషులకు సాయపడేవారు. స్త్రీలలో కొందరిని ఉపాలప్రక్షిణులుగా నియోగించేవారు.

వడ్డీవ్యాపారము. వాణిజ్యము, పరిశ్రమలనుకూడ వైశ్యులే నిర్వహించేవారు. పురాతన గ్రంథములలో వణిజ, వాణిజ్య, కుశిదిన్ మొదలయిన పదాలు వైశ్యవర్ణానికి సంబంధించి వాడబడియుండటమే యిందుకు ఆధారము. కౌటిల్యుని అర్థశాస్త్రము, మనుస్మృతిగూడ యీ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి. తమ ప్రధానవృత్తియైన పరిశ్రమలలో కుమ్మరులు, కమ్మరులు, విల్లంబలు తయారుచేయువారు. వడ్రంగులు, శిల్పులు, రాతిపై చెక్కువారు, బుట్టలుచేయువారు, విశ్వబ్రాహ్మణులు, రంగులద్దువారు, పద్మశాలీలు, కుట్టుపనివారు, రథములను తయారుచేయువారు, తాడునేయువారు, మద్యము తయారుచేయువారు చెప్పుకోతగినవి. కుట్టుపని, నూలువడకుట, బట్టలునేయుటలో స్త్రీలు ఎక్కువగా పాల్గొనేవారు.

శారీరక కష్టము, నైపుణ్యములేని పనులుచేయుట అధమంగా భావించబడుటచేత అవి శూద్రులకు వదలివేయబడ్డాయి అయితే శూద్రుడు వేద్యము, వడ్రంగము, పశువుల పెంపకము, వ్యాపారము, చిత్రలేఖనము, శిల్పము, నృత్యము, గానము, సంగీత వాద్యము మొదలయిన కొన్ని వైశ్యవృత్తులనుగూడ చేపట్టవచ్చును.[27] మహాభారతములోని ఒక శ్లోకముగూడ యీ అభిప్రాయానికి అనుగుణముగా వున్నది.[28]

ఉపద్రవములలోనూ, విపత్కర పరిస్థితులలోనూ, క్షత్రియ వృత్తియైన సైనికునిగాగూడ శూద్రుని నియమించవచ్చునని నారదస్మృతి తెలుపుతున్నది.[29]

శూద్రుడు పూనుకోతగిన యితర వృత్తి కర్మలలో మూగపాఖ జాతకము ప్రకారము యీక్రిందివి వున్నవి. (1) నూలు, పున్ని, పట్టు బట్టలనేత (2) ఖనిజములుతీయుట (3) వడ్రంగము (4) భవన నిర్మాణము (5) గాత్రము, నృత్యము, నటన (6) అధమ కార్యములు— అభ్యంగనసేవ, అలంకారము, మంగలిపని, చాకలిపని, మలమూత్రాదులు తీసివేయుట వార్తాహరుడుగా పనిచేయుట, గృహభృత్యము, అంట్లు తోముట (7) కుమ్మరిపని (8) రంగుపని (9) మేదరిపని (10) సైనికులు సవారులు, రథచోదకులుగాపని, పాలేరు,బంట్రోతు మొదలయిన యితర పనులు. ఆపస్తంభ ధర్మసూత్రము, మనుస్మృతి, విష్ణు స్మృతులలో కొన్నిచోట్ల శుచియైన శూద్రుని చేతివంటకము నారగించవచ్చునని చెప్పబడివున్నది. తల, గడ్డము క్షౌరముచేసుకుని, గోళ్ళుతీసి శుభ్రముగా స్నానముచేసిన శూద్రుడు ఆర్యుని (ద్విజుని) పర్యవేక్షణలో వంటవాడుగా పనిచేయవచ్చునని ఆపస్తంభ ధర్మసూత్రములో వున్నది[30]. తనకు భాగస్థుడుగాని, కుటుంబస్నేహితుడుగాని, గోపాలకుడుగాని, మంగలివాడుగాని, భృత్యుడుగాని అయిన శూద్రుడు వండిన ఆహారమును ద్విజుడు భుజింపవచ్చునని మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి[31] విష్ణు స్మృతి శూద్రునికి యిటువంటివి కొన్ని అవకాశములు కల్పించి వున్నవి.[32] కాబట్టి నిర్ణీతపద్ధతిలో శుచియైన శూద్రుడు ద్విజుని అధ్వర్యంలో ద్విజునికొరకు ఆహారము వండిపెట్టవచ్చునని తెలియుచున్నది. ఇంకా శూద్రుడు శారీరక మోటుపనులేగాక గృహభృత్యుడుగానూ, పరిశ్రమలలో కార్మికుడుగానూ, పొలములమీద పాలేరుగాను పనిచేయవచ్చును, లేదా, నృత్యగాన, చిత్రలేఖనాది కళల నభ్యసించి పొట్ట పోసుకొనవచ్చునని కూడ విశదపడుతున్నది.

బ్రాహ్మణులవృత్తి ముఖ్యముగా జ్యోతిష్యము, విద్యాబోధన, వైద్యము, యజ్ఞయాగాది ధర్మక్రతువులవి; క్షత్రియులవృత్తి దేశ

సంరక్షణ, రాజ్యపాలనాది ధర్మములు నిర్వహించుటవి; వైశ్యుడు పద్ధి వ్యాపారము, సేద్యము. కళలు, చేతిపనులు అవలంబించేవాడని; యితర క్షత్రికార్యములతోపాటు శూద్రుడు పాలేరుగాను, కార్మికుడుగానూ, పశులకాపరిగానూ జీవితంగడిపేవాడని మనముగ్రహించాలి. "బ్రాహ్మ ణస్య తపోజ్ఞానంతపఃక్షత్రియస్య రక్షణం। వైశ్యస్యతుతపో వార్తా తపః శూద్రస్యసేవనం ॥ (మనుస్మృతి: 11-236) అని యీ సందర్భ ములో మనువుచెప్పినాడు. ఆకాలంలో శూద్రుడంటే పరిచారకుడనే భావింపబడేది.

శారీరిక శ్రామికుల అవసరం ప్రాచీన భారతదేశములో ప్రభు త్వానికీ, వ్యవసాయ, పారిశ్రామిక రంగాలకు, గృహయజమానులకు వుండేది. పాలకవర్గమువారు చీపురుమనిషినుండి యుద్ధంలో సేనానాయ కునివరకు అనేకపనులకై మనుష్యులను నియోగించుకునేవారు. వీరో చిత కార్యములు, పూజాపునస్కారములు తప్ప యితర శారీరికపను లన్నింటిని శూద్రులకు వదిలేవారు. ద్విజులకు—అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు—వ్యాపార, పారిశ్రామిక సంస్థలకు గూడ శరీర కష్టముచేయువారి అవసరము ఎక్కువగా వుండేది. గోపాలకులు, గొఱ్ఱెల కాపరులు, కర్షక, పారిశ్రామిక కార్మికుల అవసరముగూడ అధికంగా వుండేది. ఈ విధమైన కార్యములను వైశ్యులే శూద్రులచేత చేయించు తుండేవారు. కొంతవరకు యిట్టిపనులు బానిసలచేతగూడ చేయించబడు తుండేవి.

కార్మికులు ముఖ్యముగా మూడువిధములుగా లభించేవారు. (1) బానిసలు (దాస లేక దాస్యులు), (2) శూద్రులు (అధమ వృత్తులు, మోటుపనులు చేయువారు). (3) వైశ్యులు (కుటీర వృత్తులుచేయువారు) కుటీరవృత్తులను శూద్రులుగూడ నిర్వహించినప్పటికీ నిపుణులైన కార్మి

కులు వైశ్యకులమునుండే లభించేవారు. మొత్తముమీద వుత్పత్తి కార్యములను చేయువారు వైశ్యశూద్రులేనని చెప్పవచ్చును. సాధారణముగా యీ రెండు వర్ణములనుండే నిపుణతగల పనికి, మోటుపనికి, కార్మికులు దొరికేవారు. అయితే దుస్థితిలోనున్న కొందరు ద్విజులుగూడ కార్మిక తెగలలో చేరేవారు.

శూద్రులుమాత్రమే సేవకవర్గమువారైనప్పటికీ ఉన్నతవర్ణముల వారుగూడ తమ దుస్థితికారణంగా శూద్రవృత్తుల నవలంబించేవారు. "వైశ్యుడైనవాడు తన వర్ణవృత్తుల ఆధారముగా జీవనముసాగించలేని పక్షములో శూద్రవృత్తులను చేపట్టవచ్చును గాని అట్టి దుస్థితి తొలగిపోగానే వాటిని వదిలిపెట్టవలెను" అని మనుస్మృతి నిర్దుష్టముగా పలుకుతున్నది[33]. అట్లాగే బ్రాహ్మణుడు దుస్థితిలో నున్నప్పుడు గోపాలకుడుగానూ, కర్షకుడుగానూ పనిచేయవచ్చును.[34] కష్టకాలంలో బ్రాహ్మణుడుగూడ సైనికుడుగా వుద్యోగము చేయవచ్చును గాని తనకష్టము తీరగానే తనమామూలు వృత్తిలోకి వెళ్ళిపోవలెను.

సంధ్యాది అనుష్ఠానములను నిర్వర్తించనివాడు, వేదజ్ఞానశూన్యుడు, వడ్డీవ్యాపారము చేయువాడు, చేతివృత్తులవాడు, కళాకారుడు, గోపాలకుడు, సేవకుడు, అయిన బ్రాహ్మణునిచేత ధర్మపారాయణుడైన ప్రభువు శూద్రునికి దగినపనులనే చేయించవలెనని స్మృతులలోనూ, ధర్మశాస్త్రములలోనూ వ్రాయబడియున్నది.[35,36] అంటే కొన్నిపరిస్థితులలో ద్విజులుగూడ కార్మికవర్గంలో భాగంగా పరిగణింపబడే వారని తేటతెల్లమగుతున్నది.



# రెండవ అధ్యాయము

## ప్రాచీన భారతములో బానిస వ్యవస్థ

—★—

ప్రాచీన భారతదేశంలోని సాంఘిక - ఆర్థిక వ్యవస్థలో బానిసత్వము ఒక ముఖ్యాంశముగా వుంటూ వుండేదని చరిత్ర మనకు చాటుతున్నది. ప్రపంచదేశాలలో మనదేశం వుత్తమ నాగరికత గల దేశమని చెప్పుకోబడే కాలంలో గూడ యీబానిసత్వము మనదేశంలో ప్రబలివుండింది. మనదేశంతో బాటు చరిత్ర ప్రఖ్యాతిగల గ్రీసు, ఈజిప్టు, రోమ్ బాబిలోనియా దేశాలలోగూడ యీ వ్యవస్థవుండేది. మలయన్ దీవులలోనూ, ఇండో - చైనాలోనూ, ఆఫ్రికాలోనూ ఆదిమానవుల యొక్క సంఘ జీవితంలో సర్వసాధారణంగా యీ వ్యవస్థ యిమిడివుండడమే గాక దీనిని మార్చవలసిన అగత్యము గాని నైతిక విలువలతో దీనిని పరీక్షించాలని గాని ఎవ్వరికీ తోచినట్లు కన్పడదు. అదృష్టవంతులైన కొందరి సుఖమయ జీవనానికి అంకితులై బానిసలు నికృష్ట జీవితము గడపాలని దైవనిర్దేశమయినట్లుగా భావించబడేది. ఆ కాలంలో బానిసత్వము ప్రకృతి సహజమని తలపోసే వారంటే అది అతిశయోక్తి గాదు.

మూడువేల సంవత్సరాలనాటి సుమేర్ల చట్టాలను పరిశీలించగా అప్పటికి వేయి సంవత్సరములనుంచే బాబిలోనియాలోని సుమేర్ల నాగరికతలో బానిసత్వము ముఖ్యవ్యవస్థగా గుర్తించబడినట్లు తెలుస్తున్నదని శ్రీ విలియం వెస్టర్‌మాన్[1] అంటున్నారు. యుద్ధఖైదీలు, విదేశీయులు బానిసలుగా భావించబడి వారిని బజారులో అమ్మటం, కొనటం

జరుగుతుండేదని అప్పటి సుమేర్ల శాసనాలద్వారా మనకు బోధపడు తున్నది. అయితే అప్పటికింకా బానిసలను తరువాత కాలంలోవలె అమానుషంగా హింసించటం జరిగేది కాదు. క్రీ. పూ. 2100 నాటి హమ్మురబీ చట్టాలలో అప్పుచెల్లించలేకపోవటం వలన, వంశపారం పర్యంగానూ, యుద్ధఖైదీ లగుటవలన, అమ్ముడుపోవటంవలన బానిస లుగా మారిపోయేవారికి తగు సౌకర్యాలు, హక్కులు ఇవ్వబడియున్నవి. బజారులోవస్తువుగా పరిగణించబడి దాస్య జీవితానికి కొట్టివేయబడినప్ప టికీ బానిసలకు స్వేచ్ఛలోవున్న స్త్రీని పరిణయ మాడటానికి, వ్యాపారము చేయటానికి, ఆస్తి కూడబెట్టుకోవటానికి అవకాశము లివ్వబడియుండెను. తనను తాను కొనుక్కోవటం ద్వారానూ, యజమాని తనను పెంపుడు చేసుకోవటం ద్వారాను దానిసత్వం నుండి విముక్తిపొందవచ్చును. హీబ్రూ జాతిలో జన్మించిన బానిస ఆరు సంవత్సరాల బానిస జీవితం తర్వాతగాని శాశ్వతంగా వికలాంగుడవటంతోగాని బానిసత్వం నుంచి విముక్తి పొందగలుగుతాడని హీబ్రూ చట్టాలలో వున్నది.

గ్రీసులో క్రీ పూ. 1200 నాటికి బానిసత్వం పొడసూపింది. సమకాలికమైన తోటి దేశాలలో వలె గాక గ్రీకులు తమ బానిసలను అతి మర్యాదగానూ, దాక్షిణ్యంతోనూ చూసుకునే వారు. అందువలన బానిసలు తమ యజమానులను ప్రేమతోనూ, భక్తితోనూ కొలిచేవారు. క్రీ. పూ. 800 వరకు బానిసలను అమ్మటం, కొనటం ఎక్కువగా వుండేదిగాదు. కాని గ్రీకులు విదేశ ఆక్రమణలు జరిపినకొద్దీ తమ కుటీరపృత్తులు అభివృద్ధియైనకొద్దీ బానిసవ్యాపారం క్రమంగా ఆరంభమయింది. అప్పు చెల్లించలేకపోవడంవలన ఎవరినీ బానిసలుగా చేయరాదని క్రీ. పూ. 594 లో శాసించబడింది. అయితే దీనివలన బానిసల సంఖ్య తగ్గిపోలేదు. గ్రీకేతరుల నుండి బానిసలను ఎత్తుకుపోవడంద్వారా బానిసల కొరత తీర్చబడుతూ వుండేది. గ్రీకు నగరరాజ్యముల మధ

అంతులేకుండా జరిగిన పోరాటాల కారణంగా గూడ బానిసల సంఖ్య పెరుగుతూ వచ్చింది. రోమ్‌లో గూడ దాదాపు యిదే పరిస్థితివుండేది. యుద్ధంలో పట్టుబడిపోయిన వారు, ఋణం పోలకిసవారు, కొనబడిన బానిసలై పోయేవారు. వారు తోటలలోనూ, పొలాలమీదనూ, గృహ కృత్యములలోనూ కార్మికులుగా వినియోగించబడేవారు. అయితే యిప్పుడు యజమానులు యీ బానిసలను అమానుషంగా హింసించేవారు. "ఎంత హీనస్థితిలోనైనా ప్రాణమ్మీపై తీపివదలదు" అనే భావన ప్రకారంతప్ప ఆపరిస్థితులలో నిజంగా బానిసలకు బ్రతుకును వదిలి చావుకోరుకొన దంలో ఎట్టి అభ్యంతరమూ కనిపించేది కాదు. శరీరం పట్టుతప్పి పోతేనే వారికి విరామమంటూ లభించేది. ఎందుకంటే ప్రతి యుద్ధంతో బాటు కొల్లలుగా అతి చవకధరలలో బానిసలు లభిస్తూవుండగా వారికి తగు విశ్రాంతి యిచ్చి కాపాడు కోవటం కన్న వారిచేత నిర్వి రామంగా పనిచేయించి ప్రాణం తీయటమే వుచితంగా తోచేది.

ప్రాచీన భారతదేశంలో బానిసలు వున్నారనటంలో సందేహం లేదుగాని రోమ్‌లో వలె వారిస్థితి విమర్శనీయంగా వుండేదనటం సంశ యాస్పదమే. ఋగ్వేదంలో 'దాస' అని 'దాస్యు' అని బానిసలను గురించి అనేకచోట్ల పేర్కొనబడివున్నది. ఈ దాస్యులు యుద్ధఖైదీలు, నీచ ప్రవృత్తిగల వారు కావటం వలన వారిని అనార్యులని (అంటే చట్టబద్ధంగా జీవించే ఆర్యులకు విరోధులు) పిలిచేవారు. ఆకారణంచేతనే వారికి సేవక వృత్తి కల్పించినారు. బానిసలకు యజమానులు మారుతుండే అవకాశం ఋగ్వేద కాలంలో వుండేదనటానికి తగు సాక్ష్యం వున్నది2. ఉదాహరణగా చెప్పాలంటే ఒకవ్యక్తి తనకు నూరుగురు బానిసలను బహూకరించమని కోరిన సంఘటన ఋగ్వేదంలో వున్నది.3 ఆకాలంలో స్త్రీ బానిసలు గూడ వుండే వారనటానికి ఆధారమున్నది.4 ఛందోగ్యోప నిషత్తుగూడ యీ విషయాన్ని ధృవపరుస్తున్నది.5 వేదాలలోనూ, వుపని

షత్తులలో నేగాక మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, నారదస్మృతి, కౌటిల్యుని అర్థశాస్త్రము మొదలయిన గ్రంథములలో బానిసలు.వారికర్తవ్య నిర్వహణ గురించి అనేకంగా చెప్పబడియున్నది. విదురపండిత జాతకము కులావక జాతకము, అసంపాదన జాతకము, నందజాతకము, నానాఛంద జాతకము. నామసిద్ధిక జాతకము, కతాహార జాతకము, దూరజన జాతకము, కుల్లవేతి జాతకము, సద్ధుభస్త జాతకము మొదలయిన జాతకములలో గూడ బానిస వ్యవస్థను గురించి మనకు సాక్ష్యము లభిస్తున్నది. విదురపండిత జాతకములో నాలుగు విధములైన బానిసత్వము గురించి చెప్పబడియున్నది. (1) బానిసల సంతానం (2) భోజనము, రక్షణకొరకు దానిసలైనవారు. (3) కొనబడిన బానిసలు (4) ఇతరులను తమ యజమానులుగా అంగీకరించిన బానిసలు. నిరంకుశముగా ప్రవర్తించుచున్నాడని ఒక గ్రామపెద్దను బానిసగా [illegible]మని రాజు శిక్షించిన వుదంతమును కులావక జాతకము [illegible] తెస్తున్నది. గంగ మాల, ఉరగ, కళకిన్న జాతకములలో బానిస బాలికలను ఎంతో దయతో చూసేవారని పేర్కొనబడుతున్నది. అసంపాదన జాతకములో దాసులందరినీ ఎంతో దయతో చూసేవారని, అందువలన బానిసలకు తమ యజమానులపైన ఎంతో అభిమానం, భక్తి వుండేవనీ వ్రాయబడివున్నది. యజమానులకు తమ బానిసలపై గల విశ్వాసమును గురించి నంద, నానాఛంద జాతకములద్వారా మనకు తెలుస్తున్నది. అయితే నామసిద్ధిక జాతకము మాత్రము యజమానులు, యజమానురాండ్రు తమ బానిసలను నిర్దాక్షిణ్యంగా చూసేవారని తెలుపుతున్నది. తన బానిసను ఖైదుచేయుటకుగాని, దండించుటకుగాని యజమానికి పూర్తి అధికారముండి వున్నట్లు కతాహార, కుల్లవేతి జాతకములలో వున్నది. రాకుమారులు, రాకుమార్తెలు గూడ బానిసల అంతస్థుకు దించివేయబడే ప్రమాదం వున్నట్లు వెస్సంతర జాతకము తెల్పు

తున్నది. దానిసల ధరలను గూర్చి దూరజన, నంద, సత్తుభష్ట జాతక ములలో వ్రాయబడి వున్నది. వీటన్నింటివలన బానిస వ్యవస్థ భారత దేశంలో వుండేదనే యదార్థం నిస్సందేహంగా తేలిపోతున్నది. ఆప స్తంభ ధర్మ సూత్రము ద్వారా గూడ యీ విషయం బలపడుతున్నది. ఎందువల్లనంటే బానిసలను అమ్మటం, కొనటం అందులో నిషేధించ బడింది. కొన్ని ప్రాచీన నాటకాల ద్వారా గూడ యీ సమాచారం బయట పడుతున్నది. గుప్తుల కాలంలో రచింపబడిన శూద్రకుని "మృచ్ఛకటికం" లోని స్థావరక, మదనిక, పాత్రలు యీ సత్యాన్ని ఘోషిస్తున్నాయి. ప్రాచీన భారత దేశంలో బానిస వ్యవస్థ వుండేదన టానికి యింత ప్రబల సాక్ష్యం వున్నప్పటికీ అప్పటి ఆర్థిక స్వరూపం యీవ్యవస్థ మీద ఆధారపడివున్నదనుకోవటం పెద్ద పొరపాటే అవుతుంది.

దాసులను సాధారణముగా పొలము మీద, పరిశ్రమలలో కార్మి కులుగానూ, గృహభృత్యులుగానూ వినియోగించుకునేవారు. అయితే వారికి యితర కార్మికులకు వలె స్వతంత్ర ప్రతిపత్తి లేకుండెను.

ప్రాచీన భారత న్యాయవేత్తలు బానిసలను అనేక విధములుగా విభజించారు. ఉదాహరణకు విదురపండిత జాతకములో పైన తెలిపిన నాల్గు విధముల దానిసలున్నారు. మనుస్మృతిలో ఏడు రకముల బానిస లను గురించి పేర్కొనబడి వున్నది. (1) యుద్ధఖైదీలు, (2) జీవనో పాధి గురించి బానిసత్వము చేయువారు (3) బానిసల సంతానము (యజ మాని గృహములో జన్మించినవారు) (4) కొనబడిన (5) బహూకరించ బడిన (6) ఆస్తితో సంక్రమించిన దానిసలు (7) నేరానికి శిక్షగా దాని సత్వము అనుభవిస్తున్నవారు.౧ ఇంతేగాక శూద్రునిచేత గూడ బానిసలు చేసేపనులు చేయించుకోవచ్చునని, అతడు కొనబడిన బానిస అవునా,

కాదా అని తర్కించే అవసరం లేదని మనువు అభిప్రాయమైవుందని తోస్తుంది.[7]

నారదస్మృతిలో యీ విధంగావున్నది. "బానిస మహిళకు తన యజమాని యింట పుట్టిన వ్యక్తి, కొనబడిన, బహూకరించబడిన, ఆస్తితో సంక్రమించిన వ్యక్తి, కరువు కాటకములవలన తన పోషణకై ఒకరిని ఆశ్రయించిన వ్యక్తి, అప్పుకు బదులుగా ఒకరిచేత పరొకరికి తాకట్టు పెట్టబడిన వ్యక్తి బానిసలే అవుతారు." ఇంకా, ఋణ విమోచనం పొంద లేనివాడు, యుద్ధఖైదీ, పందెములో ఓడినవాడు, ఇచ్ఛపూర్వకంగా బానిసత్వము స్వీకరించినవాడు — వీరంతా బానిసలే. ఇట్లాగే తన ఉదర పోషణార్థమై బానిసత్వము ఒప్పుకున్నవాడు, బానిస మహిళను వివాహమాడుటకు బాని సత్వము స్వీకరించినవాడు, తనను తాను అమ్ముకున్నవాడు బానిస కాగలడు.[8]

కౌటిల్యునికి పూర్వము బానిసలు తమ యజమానుల దయాదాక్షి ణ్యములపై బ్రతికేవారు. యజమానులలో దయామయులూ వుండిరి, కఠిన స్వభావులూ వుండిరి. ధనపాలి అనేబాలిక తీవ్రముగా హింసించబడి యితరుల శుశ్రూషకై వినియోగించబడిన కథ నామసిద్ధి జాతకములో మనకు తగులుతున్నది. కుల్లశేతి జాతకములో శేఠి కుమార్తె తాను బానిస యువకునితో జరిపిన ప్రణయ కలాపాలు తండ్రికి తెలిస్తే యిద్దరినీ ముక్కలుగా నరికివేస్తాడని భయపడుతుంది. కఠాహక జాతకములో బానిసయైన కఠాహకుడు యజమానుల కాఠిన్యమును భరించలేక చివరికి ఖైదీగా బ్రతుకుటకు యిష్టపడక యిల్లువిడిచి పారిపోతాడు. కాని అందరు యజమానులు యీవిధంగా లేరు. సహృదయులైన కొందరు యజ మానులు బానిసలను తమ కుటుంబ సభ్యులుగా చూసుకుని వారిపై పూర్తి విశ్వాసముంచేవారు. ఉదాహరణకు నందజాతకములో యజమాని తన

ఐశ్వర్యపు రహస్యాలన్నింటిని తన బానిసకు తెలిపేవాడు. నానాఛంద జాతకములో బ్రాహ్మణుడైన యజమాని ముఖ్య విషయాలపై బానిస దాలికయైన పన్నాతో సంప్రతించేవాడు. అనుసంపాదన జాతకములో బానిసత్వమునుండి విడుదలచేయబడిన బానిసలు తమ పూర్వ యజమాని యెడల భక్తి పరాయణులై మెలిగినారు. ఈ విధంగానే సింకలకణ్ణి, గంగమాల, ఉరగజాతకములలో యజమానులు తమ బానిసలను ఆప్తుల వలె ఆదరించి పోషించేవారని మనకు గ్రాహ్యమవుతున్నది.

దాదాపు క్రీ. పూ. 320 నాటికి బానిసల పరిస్థితి యెంత అభివృద్ధి పొందిందంటే అప్పుడు మనదేశానికి వచ్చిన విదేశయాత్రికులు భారత దేశంలో బానిస వ్యవస్థ వున్నదని తెలుసుకోలేకపోయారు. పశ్చిమ దేశాల బానిసల దారుణ పరిస్థితులకు అలవాటుపడిపోయిన మెగస్తనీస్ భారతదేశంలో బానిసలు లేరనే అనుకున్నాడు. ఈయన మాటలమీద ఆధారపడి అర్రియన్ చరిత్రకారుడు "భారతదేశంలో అంతా స్వతంత్రులే, అక్కడ అస్వతంత్రులైన బానిసలు లేనే లేదు" అని వ్రాశాడు. మెగస్తనీస్‌కు పూర్వమువాడైన ఓనెసిక్రిటోస్ గూడ సింధులోయలో బానిసలు లేరని వక్కాణించాడు. నిజంగా మనదేశంలో బానిస వ్యవస్థ వుంటివున్నప్పటికీ యితరులకు అది గోచరించలేదంటే ఆ శ్రేయస్సు కౌటిల్యుని అభ్యుదయ విధానానికే జెందుతుంది. బానిసత్వము వుండట మంటే దేశం వెనుకబడి యుండటమేనని కౌటిల్యుని విశ్వాసము.

## కౌటిల్యుని సంస్కారణలు

కౌటిల్యుడు ప్రప్రథమంగా అల్పవయస్కులైన పిల్లలను బానిసలుగా అమ్మటం, కొనటం నిషేధించాడు. తన పిల్లలనుగాని, తన బంధువుల పిల్లలనుగాని అమ్మేవారికి, తాకట్టు పెట్టేవారికి అత్యధికంగా

అపరాధం విధించబడేది. శూద్రుడు పసిపిల్లవాడిని అమ్మితే పన్నెండు 'పణములు' చెల్లించాలి. అదే నేరం వైశ్యుడు, క్షత్రియుడు, బ్రాహ్మణుడు చేస్తే అంతకు రెండు, మూడు, నాల్గురెట్లు అపరాధం చెల్లించుకోవాలి.[9] ఈ వ్యవహారం నడిపేవారేగాక అందుకు సాక్షులుగావున్నవారు శిక్షించబడేవారు.[10] ఒక యిబ్బంది తీరుటకై ఆర్యుడైన వ్యక్తిని తాకట్టు పెట్టవలసి వస్తే సాధ్యమైనంత త్వరలో ఉపయుక్తమైన ధనం సేకరించి అతనికి విముక్తి చేకూర్చే అవకాశం వుండేది.[11] కాని మ్లేచ్ఛులు క్రూరులు, వెనుకబడినవారు గాబట్టి వారి బిడ్డలను అమ్మటం, కొనటం కౌటిల్యుడు నిషేధించలేదు. ఆర్యుడు మాత్రము యెట్టి పరిస్థితిలోనూ బానిసగా వుండకూడదు.[12] విదేశీయులను ముఖ్యంగా గ్రీకులను రోమనులను కౌటిల్యుడు మ్లేచ్ఛులుగా భావించేవాడు. వారి దేశాలలో సామాజిక వ్యవస్థ బానిసత్వముపై ఆధారపడి వుండటమే యిందుకు కారణమయి వుండవచ్చును. ఆర్యుడంటే ద్విజుడని గాక కౌటిల్యుడు శూద్రులను గూడ ఆర్యులలో కలిపివేశాడు. ఈ విధంగా కౌటిల్యుడు బానిసత్వము రూపుమాపుటకేగాక శూద్రుల దుస్థితిని తొలగించుటానికి గూడ ప్రయత్నించాడు. కొన్ని పరిస్థితులలో మహిళలను, పసివారిని బానిసలుగా అమ్మటం, కొనటం నిషేధించి కౌటిల్యుడు వీరి బాగోగుల పట్ల తన శ్రద్ధను ఋజువు చేసుకొనెను. ఎనిమిది సంవత్సరముల వయస్సుకు లోబడిన తన బానిసలచేత నీచకార్యములు చేయించువారికి అమ్మినట్లయితే అట్టి ఆర్యునికి అధికంగా అపరాధం విధింపబడేది. ఇట్లే గర్భిణియైనస్త్రీ బానిసను ఆమె సుఖప్రసవమునకు యేర్పాటు చేయకుండా అమ్మజూచిన వారికి కూడ పెద్ద అపరాధం పడేది. ఆమెను కొన్నవారికి, యీ బేరానికి సాక్షులుగా వున్నవారికి గూడ యీ అపరాధం వర్తించేది.[13]

కాబట్టి ఆకాలములోగూడ సాంఘిక సంక్షేమ పథకాలంటూ వుండేవనటం నిస్సందేహము

బానిసలచేత అపవిత్రమైన పనులు చేయించరాదని, వారి మాన మర్యాదలను భంగపరచరాదని ఆజ్ఞాపించి కౌటిల్యుడు మానవజాతి యొక్క ఔన్నత్యంపై తన విశ్వాసాన్ని ప్రకటించుకున్నాడు. ఈ ఆజ్ఞను పాటించుటలో ప్రమత్తులైనవారు తాము బానిసలకై సమర్పించిన వెలను శాశ్వతముగా నష్టపడవలసి వుండెను. యజమాని తన పరిచారకురాలైన స్త్రీ బానిస మానభంగము చేసినా, ఆమెచేత అపవిత్ర కార్యములు చేయించినా ఆ బానిసను విడుదల చేయటమేగాక ఆమెకై వెచ్చించిన మూల్యమును నష్టపడవలసి వుండెను.[14] కొన్ని పరిస్థితులలో బానిసపై పోషించధనానికి రెండింతల అపరాధం విధించబడేది.[15]

ఇంకా కొన్ని నిబంధనలు మహిళ బానిసల సంరక్షణకై యేర్పాటు చేయబడ్డాయి.[16,17,18] ఈ నిబంధనలవలన యజమాని తన బానిసల నిస్సహాయతవలన అన్యాయమైన లాభము పొందటానికి వీలులేకుండా చేయుటమేగాక స్త్రీ బానిసల పరిస్థితులను చక్కబరచటానికి యివి యెంతో పుపకరిస్తున్నాయి.

పురుష బానిసల విషయములో ప్రభుత్వము చాలా సహాయము చేసేది. పరిస్థితుల ప్రోద్బలమువలన బానిసలుగా మారిన గౌరవనీయుల చేత నీచకార్యములు చేయించగూడదని ఎవరైనా వారిచేత అపవిత్ర కార్యములు చేయిస్తే వెంటనే వారి బానిసత్వము తొలగిపోగలదని అనేక చట్టాలు చేయబడ్డాయి.[19] ఆర్యుడు బానిసగా మారినప్పటికి అతని సంతానము ఆర్యులుగానే వుంటారు.[20]

కొన్ని విధులను పాటించినప్పుడు బానిసలు స్వతంత్ర జీవులయ్యే అవకాశములుండేవి. బానిసగా అమ్మబడిన వాడు తనను కొన్నవెలను

తన యజమానికిచ్చి స్వేచ్ఛను పొందవచ్చును.[21] యుద్ధఖైదీగా పట్టిన వాడు తనకై ప్రత్యేకింపబడిన నివృత్తి మూల్యములో సగము తానే చెల్లించినట్లయితే స్వతంత్రుడు కాగలడు.[22] తనపై విధించబడిన అపరాధాన్ని చెల్లించలేకపోవటంచేత బానిసగా మారినవ్యక్తి అట్టి అపరాధం చెల్లించి వేయటంతోగాని, అందుకు బదులుగా కొంత చాకిరి చెయ్యటంతోగాని విముక్తుడు కాగలడు.[23] ఒకరిచేత బానిసగా తాకట్టు పెట్టబడిన వ్యక్తిని విడుదల చేయటానికి తాకట్టు ధనముకన్న ఎక్కువ తీసుకోరాదని సూత్రీకరించబడింది.[24] విడుదల మూల్యమును పొందినాక తన బానిసను విడుదల చేయని యజమానికి పన్నెండు పణముల అపరాధం విధించబడేది. తన బానిసను నిష్కారణంగా బంధించి పెట్టినవానికి గూడ యీ విధమైన శిక్షపడేది.[25]

బానిసలు ఆస్తిపొందే హక్కుగలిగి వుండటం కౌటిల్యుని ఉదారతకు మరొక నిదర్శనం. తమ తలిదండ్రులు వదలిపోయిన ఆస్తిపాస్తుల మీదగాని తాముసంపాదించుకున్న ఆస్తిపైగాని బానిసలకు పూర్తి హక్కులుండేవి. అయితే యిందుకు వారి యజమానులు సమ్మతించవలసి వుండెను. అప్పటిలో యజమానులు దయార్ద్రహృదయులైనవారు కావటంచేత బానిసలకు యిట్టిఅనుమతి చాలావరకు సునాయాసంగా లభించేది.[26] కాని బానిసకు వారసులులేనప్పుడు అతనిఆస్తి యజమానుల పరమయ్యేది.[27] తమ యజమానుల పనులకు ఆటంకము రాకుండా యితరపనులు చేసుకుని బానిసలు తమ స్వాతంత్ర్యప్రాప్తికి కావలసిన ధనముసేకరించుకోవచ్చును. భారతదేశ చరిత్రలో స్వర్ణయుగమనబడే కాలంలో బానిసల బ్రతుకుభారము తగ్గించబడి యీ విధంగా చాలావరకు వారి జీవితాలు సుఖప్రదం చేయబడియున్నాయని స్పష్టమగుచున్నది. మొత్తము బానిసవ్యవస్థనే పెకలించివేయాలనే ప్రయత్నాలు జరిగాయి. ఎవరైనా బానిసగా వుండిపోవలసివచ్చినా అతడిని బానిసగా ఎంచటా

గుర్తించజాలనంతగా అతనిజీవనస్థితి మెరుగుపడెను. అందువల్లనే విదేశీయులు మనదేశంలో బానిసత్వము నిజంగానే లేదని బల్లగుద్ది వాదించారు.

బిందుసారుడు, అశోకుడు యిట్టిపరిస్థితులను నిలబెట్టుటకు ప్రయత్నించి సఫలీకృతులైనారు. అశోకుని తొమ్మిదవ రాతిశాసనంద్వారా యిది ఋజువగుతున్నది. "దయాదాక్షిణ్యాలంటే, యితరవిషయాలతో బాటు, బానిసల స్థితిగతులను చక్కబరచటము, బానిసలపట్ల కూలీలపట్ల ప్రేమభావముతో వ్యవహరించటము అని అర్థము" అని అందులో వ్రాయబడివుంది.

మౌర్యుల తర్వాతకాలములో బానిసలస్థితి మళ్లీ క్షీణించుట మొదలయింది. యజమానులు తమబానిసలతో రోమనులవలె ప్రవర్తించనారంభించారు. నీచపుచాకిరి చేయించుకోవటం చట్టసమ్మతముగా చేయబడింది. నారదస్మృతిలో ఋషులు సేవకులను అయిదురకములుగా విభజించారు. విద్యార్థులు, పనినేర్చుకొనువారు, పరిచారకులు, అధికార్లు— యీ నాల్గుతరగతులవారు కర్మాకరులని పిలువబడేవారు. వీరు శుచియైనకార్యములకే నియోగింపబడేవారు. అయిదవ తరగతివారైన బానిసలు అన్నిరకముల నీచపు, అపవిత్రపు పనులు చేయవలసి వుండెను.[28]

బానిసలకు నీచమైనపనులు చేయటం అనివార్యమైనదేగాక అట్టిపని చేసేవారిని యజమానులు నిర్దాక్షిణ్యముగా హింసించేవారు. కౌటిల్యుని చేత అనుమతించబడిన ఆస్తిహక్కులుగూడ యిప్పుడు బానిసలకు లేకుండాపోయినవి. "అర్థశాస్త్రము" తర్వాత వ్రాయబడిన మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, నారదస్మృతి మొదలయిన గ్రంథాలలో దానినకు ఆస్తిపైన హక్కులేవీ వుండవనీ, అతడు ఎంతధనమార్జించినప్పటికి అదంతా అతని యజమాని జీవితకాలంలో యజమానికే సక్రమించ

గలదని స్పష్టంగా వ్రాయబడివున్నది.[29,30] ఇంతకన్న విపులంగా మను స్మృతిలో దానికు ఆస్తివుండే అవకాశంలేదు గనుక తనదానినద్మైన శూద్రుని సొమ్మంతా బ్రాహ్మణుడు వశపరచుకోవచ్చునని వున్నది[31]. అయితే తనకు కొనటానికి తనయజమాని యిచ్చిన వెలతాలూకు ధనము, తనకు యజమానినుంచి లభించిన బహుమానాలను మాత్రము దానిని వుంచుకోవచ్చని తర్వాతకాలంలోని ధర్మసూత్రాలలో అంగీకరించ బడింది[32]. కాని దానిసలపైవుండే అనేకమైన విధినిషేధాలలో యిటు వంటి చిన్న వదుపాయాలు సముద్రంలో కాకిరెట్టలాంటివనే చెప్పాలి.

తనకుటుంబపరియోజనార్థమై దానిన తీసుకున్న అప్పును ఆతనుతీర్చుకోలేకపోతే అతనికుటుంబమువారు తీర్చుకోవాలని నారద స్మృతిలో సూత్రీకరింపబడ్డది[33]. ఇటువంటి అభిప్రాయాన్నే కాత్యా యనుడు వెలిబుచ్చియున్నాడు[34]. విష్ణుస్మృతిలో యిందుకు పోలిన మరొక శ్లోకం కనబడుతుంది[35].

తనయజమానికి అతనికుటుంబానికి లాభించేవిధంగా దానిస యజమానితరఫున వ్యవహారం చేయవచ్చును. ఈ వ్యవహారాలన్నిం టికి యజమాని బద్ధుడైవుండగలడు. అంటే యజమానికి తనదానిసపై యెంత నమ్మకముండేదో, దానిన తనయజమానిపట్ల యెంత విశ్వాస పాత్రంగా మెలిగేవాడో బోధపడుతున్నది.

యోగ్యులైన సాక్షిలు లభించనప్పుడుగాని తగినయితర సాక్ష్యం లేనప్పుడుగాని దానిసలు న్యాయస్థానాలకు వెళ్లి సాక్ష్యంయిచ్చేవారు. వారి సాక్ష్యాలను న్యాయస్థానంవారు సగౌరవంగా స్వీకరించేవారు[36].

కొన్నిషరతులు పూర్తిచేసి దానిసలు స్వాతంత్ర్యస్థితి పొంద వచ్చునని యిదివరలో చెప్పబడింది. ఈ విషయంలో నారదస్మృతి ఏం చేయమున్నదంటే బాకీలు చెల్లించలేకపోవటంవలన విక్రీతకాలం దానిస

శిక్ష అనుభవిస్తున్న వ్యక్తి తన బాకీని వడ్డీతోసహా చెల్లించి వేయటంతో గాని, శిక్షాకాలం పూర్తి కావటంతోగాని తనను విడుదలచేయించుకో గలడు[37]. కరువుకాలంలో స్వయంపోషణార్థమై బానిసగా మారినవ్యక్తి రెండు ఆవులను తనయజమానికివ్వడంతో స్వతంత్రుడు కాగలడు[38]. సాధారణ కాలంలో పోషణకై బానిస అయినవాడు అట్టిపోషణను విరమించుకోవటంతోనూ, బానిస మహిళతో సంభోగించి బానిసైనవాడు అట్టిసంబంధం మానివేయటంతోనూ విముక్తులుకాగలరు[39]. బానిస మహిళకు యజమాని గృహంలో జన్మించిన బానిసలు యజమాని అనుమతిస్తేనే విడుదలకాగలరని నారదస్మృతిలో వున్నది[40]. యుద్ధఖైదీలు, జూదంలో ఓడినవాడు, ఐచ్ఛికంగా బానిసత్వం స్వీకరించినవాడు, యజమానికి తగిన పరిహారంచెల్లించి స్వతంత్రులుకాగలరు[41].

స్వతంత్రజీవులైనవారు, సాధువులైనవారు పామరులుగా మారి బానిసత్వమువాతబడకుండా వారించేందుకని నారదస్మృతిలో సాధువైనవాడు తన నిష్ఠనువిడిలితే శాశ్వతంగా ప్రభువుకు బానిసగా పోవలెనని, తిరిగి ఎన్నటికీ స్వతంత్రుడుకాజాలడని హెచ్చరించబడివున్నది[42]. అవిరతిపరుడైనవాడు తన్నుతాను బానిసగా అమ్ముకున్నట్లయితే జీవితాంతముపరకు తిరిగి విముక్తి పొందజాలడనిగూడ అందులోవున్నది[43].

దొంగలచేతపట్టుబడి బానిసగా అమ్మబడినవ్యక్తికి రాజు తిరిగి స్వేచ్ఛను ప్రసాదించేవాడు. ఎందుకంటే అటువంటిబానిసత్వము చట్టసమ్మతముగాదు[44]. ఏవ్యక్తినీ బలవంతముగా బానిసచేయటానికి వీలులేదు. దాదాపు యిటువంటి శ్లోకమే యాజ్ఞవల్క్యస్మృతిలో వున్నది[45]. యుద్ధములో పట్టుబడినవాడు తప్ప యేయితర వ్యక్తినైనా బలవంతంగా బానిసత్వానికి గురిచేసినట్లయితే రాజు అతనికి స్వేచ్ఛను ప్రసాదించగలడని ఆ శ్లోకము చెప్పుతున్నది.

బ్రాహ్మణులు అహంభావంతో యితరులను పీడించకుండా వుండేట్లు మనువు గట్టియేర్పాటుచేశాడు. ద్విజునిచేత అతనికిష్టములేకుండా బానిసపనిచేయించిన బ్రాహ్మణుడికి ఆరువందల పణముల అపరాధం విధించబడేది46. మరొక శ్లోకం47 ప్రకారం నేరస్తులైనభార్యను కుమారుడిని, బానిసను, శిష్యుడిని, తమ్ముడిని తాడుతోగాని చీలిక బెత్తంతోగాని వారివీపుమీద కొట్టాలేగాని సున్నితమైనచోట్ల కొట్టరాదు. ఈ నిషేధాన్ని వుల్లంఘించినవాడు దొంగతనముచేసిన నేరానికి గురియవుతాడు. అనగా తనపోషణలోవున్న వారిని యజమాని అమానుషంగా హింసించకుండా చేయాలనేప్రయత్నం ఆరోజుల్లో జరిగినట్లు తెలుస్తున్నది.

తనయజమాని ప్రాణానికి తనప్రాణం అడ్డువేసి యజమానిని మృత్యువువారినుండి రక్షించిన బానిస ఆటుతరువాత యజమాని హోదా పొందగలడు48. బానిసలుచేసిన త్యాగాలు విస్మరించబడవనీ, తగువిధంగా అందుకుపరిహారం ఇవ్వబడుతుందని యిందువలన స్పష్టమవుతున్నది.

పైన తెలుసుకొన్న విషయాలవలన భారతదేశంలో బానిసలను క్రూరంగా హింసించడం సాధారణంగా జరగలేదని. గ్రీసు, రోము దేశాలలోవలె వారి అసహాయతమూలంగా వారికి వెట్టిఅక్రమప్రవృత్తిన, అన్యాయమైన పీడనలేకుండిందని గ్రాహ్యమగుతున్నది. ప్రాచీన కాలంలో మన ఆర్థికవ్యవస్థకు బానిసవ్యవస్థ మూలాధారముగా లేకపోవటంచేతనే యిట్టి సమరసభావం ప్రబలివుండేది. మనుష్యులను ఎత్తుకుపోయి బానిసలుగాచేసుకోవటంగాని, బానిసవ్యాపారముగాని భారతదేశంలో ప్రోత్సహింపబడి యుండలేదు. ఇందుకుమనం న్యాయంగా గర్వపడవచ్చును. ఇంకాచెప్పాలంటే మూరేళ్లక్రితం నాటి "నాగరికత

గల అమెరికన్ల" కంటె మనమెంతో పైమెట్టులోవుండేవాళ్లం. బానిసలు అందరికంటే అధమశ్రేణిలోని కార్మికులుగా భావించబడినప్పటికీ వారిని హింసించిన దృష్టాంతాలు చాలాతక్కువ. ఈ సందర్భంలో ''కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా" అనే గ్రంథంలో పేర్కొనబడ్డ యీ క్రింది వాక్యాలు మనము చదివి ఆనందించవచ్చును. "....జాతక కథలలో బానిసలను ఆదరించటం, చదువు, వృత్తివిద్యలు నేర్చుకోటానికి అనుమతించడం మనముచూస్తాముగాని హింసించడం మనకెక్కడా అగుపించదు.........యజమానినివిడిచి పారిపోయిన బానిసలప్రసక్తి మనకెక్కడా తగలదు"49.



# మూడవ అధ్యాయం

## ప్రాచీన భారతంలో వ్యవసాయం తత్సంబంధమైన వృత్తులలో కార్మికులు



క్రీ. పూ. దాదాపు 2500 నాటికి సంహారయుగము [illegible] ప్రజలు వ్యవసాయాన్ని ముఖ్యవృత్తిగా అవలంబించారని ఋగ్వేదం లోని భూమిని సస్యశ్యామలం చేయమని వరుణదేవుని ప్రార్థించే [illegible] వలన తెలుస్తున్నది. (VII—101 3; X — 105.1; X 50 3; IV—57.1; అందులోని దశమ మండలములో జూదంలో విధ్వస్తుడైన [illegible] వ్యవసాయం చేస్తే ఈ పరిస్థితి తప్పక [illegible] బడింది. అనగా ఆనాడు వ్యవసాయానికి అటువంటి ప్రా[illegible] వుండేదన్నమాట. ఇంతేగాక అధర్వణవేదంలోనూ (III.14; VI. 91.1; VI — 50.142; VIII — 10.24; XIX.31.3). తైత్తిరీయ సంహితంలోనూ (IV.2; V.1.7.3; VII — 2.10), శతపథబ్రాహ్మణం లోనూ (I.6 1.3) కౌశితకీబ్రాహ్మణంలోనూ (XIX.3) [illegible] దాన్నిబట్టి వ్యవసాయానికి అధిక ప్రాధాన్యం ఉన్నట్లు [illegible] టున్నది.

వ్యవసాయం ముఖ్యవృత్తియైనప్పటికీ [illegible] కోసం వినియోగించబడిన కార్మికుల విషయంలో [illegible] ట్టాలేదు. జనసంఖ్యలో అధికంగా నాల్గవంతులు [illegible] లంబించటంవలన బహుశః జీతంపుచ్చు కార్మికులుండా [illegible] టం తక్కువగా వుండివుండవచ్చును. వ్యవసాయం చేయుటం [illegible]

గౌరవప్రదమైనదిగా భావించబడటం*వలన ప్రతివారు స్వంతగా సేద్యం చేసేవారేగాని యిందుకని కార్మికులను నియమించటం అరుదుగా వుండేది. దాదాపు అందరూ స్వయంపోషకంగా వుండటంచేత భూమి లేనివాడు, జీతం తీసుకుని పనిచేయటానికి వచ్చేవారు చాలా కొద్ది. అంతులేని పొలము కలిగిన ఏ కొద్దిమంది ధనవంతులకోగాని పొలము పనికై జీతగాళ్ళను, బానిసలను నియమించే అవసరం లేకుండెను. ధనికులు తమ పొలాలమీద పనులు చేయడానికి దాసీలను అంటే బానిస బాలికలను నియమించేవారని అధర్వణ వేదంలో పేర్కొనబడివున్నది. ఈ విధంగా బానిసలను, కార్మికులను వ్యవసాయం పనులకోసం నియమించటమనేది తరువాత శతాబ్దాలలో బాగా అలవాటైపోయిందిగాని ప్రాచీన వ్యవసాయిక వ్యవస్థకు బానిసత్వం మూలాధారంగా వుండేదన టానికి యెక్కడా అధారాలులేవు.

కుటుంబములోని స్త్రీలు, పిల్లలు వ్యవసాయంలో ఆ కుటుంబ పోషకునికి సాయపడేవారు. అందువలన పొలముపని చేసేవాళ్ళంతా యజమానులే. అయితే నాగలి పట్టటానికి (కృషీవలులు), తూర్పార పట్టటానికి (ధాన్యకృతులు),నారు వేయడానికి (వాపలు) కార్మికులను వినియోగించడం, బానిసలను వుంచుకోవడం జరిగేది.

కాలక్రమేణా భూమిలేని కార్మికులంటూ ఒక జాతి యేర్పడి పెరుగుతూ వచ్చింది. అప్పటికి సమాజం నాల్గు నిర్దుష్టమైన వర్ణాలుగా విభజింపబడిపోయింది. వ్యవసాయవృత్తి వైశ్య వర్ణమువారికి ప్రత్యే కించబడినట్లు వివిధ సంహితాలు, ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. ఉదా

---

*"ఉత్తమ షేతిమధ్యమ బాన్। నికృష్ట చాకిరీ భీఖ్ నిదాన్॥" అనే పురాతనసోక్తివలన ప్రాచీన భారతదేశంలో వ్యవసాయం అతిగౌరవ ప్రదమైన వృత్తిగా భావించబడేదని బుజువగుచున్నది.

హరణాను శంఖసంహితములో "వ్యాపారము వ్యవసాయము పశుపోషణ వైశ్యులకు అప్పగించబడిన విధులు" అని స్పష్టంగా వున్నది. వైశ్య వర్ణస్థులు వాణిజ్యం, వ్యవసాయం, పశుపోషణ, వడ్డీవ్యాపారం చేయుటనికి అధికృతులై వున్నారని గౌతమ ధర్మసూత్రములో వున్నది.[2] ఈ విధముగానే వశిష్ఠ ధర్మసూత్రములో,[3] హారీతసంహితము[4] లో నూ పేర్కొనబడివున్నది. దాదాపు వైశ్యులందరూ ధనవంతులైవుండటం వలన వారివృత్తి అయిన వ్యవసాయ కలాపాలకోసం కూలీలైన కార్మికులను అంటే శూద్రులను (వీరికి భూమివుండే అవకాశం ప్రమాణనార్థమే గనుక), బానిసలను జీతాలపై నియోగించేవారు.

వేదాల తర్వాతియుగములో వ్యవసాయంలో కార్మికులను నియోగించే వారనేది నిస్సంశయమని కౌటిల్యుడు, నారదుడు, బృహస్పతి వ్రాసిన గ్రంథాలద్వారా తెలుస్తున్నది. కౌటిల్యుడు ఒక సందర్భములో "సీతాధ్యక్షుడు" పొలములలో నాట్లు వేయుటానికి బానిసలను, జీతగాళ్ళను, కార్మికులను లేక శిక్ష అనుభవిస్తున్నవారిని వినియోగించటం జరిగేదని చెప్పివున్నాడు.[5] అయితే యిది బహుశః ప్రభుత్వ భూములకు లేక ప్రభువుల భూములకు సంబంధించి వుండవచ్చును. ప్రాచీనభారతంలో వ్యవసాయిక కార్మికులుండేవారని నారదస్మృతిలో గూడ తగినంత సాక్ష్యమున్నది.

కార్మికుల విభిన్నశ్రేణులను గురించి చెబుతూ బృహస్పతి సైనికులకంటె వ్యవసాయిక కార్మికులు మోటుపనివారని, వారికంటెగూడ గృహ భృత్యులు తక్కువవారని అన్నారు.7

## ఉద్యోగనిబంధనలు

కార్మికుల హోదాలనుబట్టి—వారు బానిసలైనా, జీతగాళ్ళైనా—వారి ఉద్యోగ నియమాలు మారుతుండేవి. బానిసల కష్టానికి బదులుగా వారికి

జీవన పోషణమాత్రమే యివ్వబడేదిగాని యితర జీతగాళ్లకు లెక్క ప్రకారం జీతం లభించేది. ఇంకొక గమనించదగిన భేదమేమంటే కార్మికులు బానిసలవలె రోజంతా చాకిరీ చెయ్యనక్కరలేదు, పైగా వారు స్వేచ్ఛావిహీనులు గూడాకారు.

సాధారణంగా కార్మికుల జీతాలు ముందుగానే నిర్ణయించుకోడం జరిగేది. ఒకవేళ అట్లా మొదటే నిర్ణయంచేసుకోని పక్షంలో ఆ వచ్చిన లాభంలోనో, వుత్పత్తిలోనో భాగానికి (సామాన్యంగా పదో వంతు) వారు అధికారులై వుండేవారు. కౌటిల్యుడు తన "అర్థశాస్త్రము" లోనూ, తరువాత యాజ్ఞవల్క్యుడు[9], నారదుడుగూడా[10] యిటువంటి అభిప్రాయాలనే ప్రకటించారు. అయితే బృహస్పతి ప్రవేశపెట్టిన నిబంధనలు యిందుకు భిన్నంగానూ, యింతకంటె మెరుగుగానూ వున్నాయి. జీతం తీసుకుని పనిచేసిన వారికి గూడ ఉత్పత్తిలోనో, పాలలోనో కొంతభాగం అదనంగా యివ్వబడేది. తిండి, గుడ్డతీసుకునే కార్మికులకు అయిదోవంతు, లాభాలలోనూ, వుత్పత్తిలోనూ భాగం కోరేవారికి మూడోవంతు లభించేది.[11]

కౌటిల్యుని అర్థశాస్త్రము ద్వారా వ్యవసాయ కార్మికులకు ధన రూపములో యివ్వబడే జీతం గురించి మనకు కొంత తెలుస్తున్నది. రాజరికానికి జెందిన భూముల అధికారియైన సీతాధ్యక్షుడు తనక్రింద పనిచేసే కార్మికులకు తిండిపెడుతూ నెలకు ఒకటిం పావు 'పణములు' చెల్లించవలసియుండెనని అందులో వ్రాయబడివున్నది.[12] అయితే తమకు యివ్వబడిన వ్యవసాయిక పరికరాలను జాగ్రత్త పరుచుకునే బాధ్యత కార్మికులదే.[13]

## యజమానితో సంబంధాలు

ప్రాచీన భారతంలో భూస్వాములకు సేద్యంచేసే వారికి మధ్య సత్సంబంధాలుండేవని చెప్పవచ్చును. నియమితకాలానికి కార్మికులకు

జీతాలు చెల్లించని యజమానులకు శిక్షవిధించబడుతుందేమని యీ విష యం గురించి వ్రాయబడిన మరొకచోట తెలియజేయబడింది. కార్మి కులు గూడ యజమానుల పట్ల విశ్వాస పాత్రులుగాను, వారి పట్ల శ్రద్ధతోనూ మెలగవలసివుండెను. పనిచేయటానికి నిరాకరించినా, పనికి వెళ్లకుండా ఎగవేసినా తీవ్రంగా శిక్షింపబడేవారు. చిన్నచిన్న తప్పులు గూడ విడిచిపెట్టబడేవి. ఉదాహరణకు పొలము దున్నేపనికి నియమింప బడిన కార్మికుడు తనపనిని వదిలివెళ్లిపోయినచో బెత్తపు దెబ్బలు తినవలసి వుండెను.[14]

జీతాల విషయంలో యజమానులకు కార్మికులకు వివాదాలు వచ్చి నప్పుడు ఆ చేసిన పని ఆధారంగానో, లభించిన సాక్ష్యాల ఆధారంగానో తగువు తీర్చడం జరిగేది.[15] కార్మికులకు తగుమాత్రంగా సెలవుతీసుకో డానికి—ముఖ్యంగా అస్వస్థులైనప్పుడు—అవకాశాలుండేవి.[16]

## గోపాలకులు

వ్యవసాయంతో దగ్గర సంబంధముగల పశువుల పెంపకం వృత్తిని గురించి చాలా పూర్వకాలంనుంచి అనేక విషయాలు తెలుస్తు న్నాయి. వేదకాలంలోనూ, వేదాలకు పూర్వోత్తర కాలాలలోనూ యీ వృత్తికి యెక్కువ ప్రాధాన్యం వుండేది. పశువుల పెంపకాన్ని గురించి వేదాలలోనూ, వివిధ సంహితాలలోనూ, జాతకములలోనే గాక భారత రామాయణాలలో గూడ ప్రస్తావించబడివున్నది. ఇంతకుముందే తెలిసి యున్నట్లు యీవృత్తి వ్యవసాయమువలె వైశ్యుల వృత్తిగా వుండేది. అయితే వైశ్యులు యీ వృత్తి నిర్వహణలో, ముఖ్యంగా పశువులను మేపుటకు, వాటి సంరక్షణకు, పాడితీయటానికి కార్మికులను వినియోగించే వారు. శంఖ, హరిత సంహితాలలోనూ, గౌతమ,[17] వశిష్ట[18] ధర్మ సూత్రాలలోనూ యీ విషయాలను గురించి పేర్కొనబడివున్నది.

## గోపాలకుల ఉద్యోగనిబంధనలు, జీతాలు

వ్యవసాయ కార్మికుల జీత భత్యాల, కార్య నిబంధనల వంటివే గోపాలకులకు గూడ వర్తించేవి. ఒప్పందాల పద్ధతిమీద వీరి జీతాలు నిర్ణయించబడేవి. పూర్వ నిర్ణయము లేనప్పుడు ఉత్పత్తిలో దశమ భాగము జీతముగా యిచ్చేవారని కౌటిల్యుని అర్థశాస్త్రము[19], నారద స్మృతు[20] ల వలన తెలుస్తున్నది. గోపాలకుల వేతనవిషయాలు నిర్ణయించ టానికని నారదుడు ప్రత్యేకంగా కొన్నినియమాలుచేసివుంచాడు.[21] నూరు గోవుల బాధ్యత వహించేవానికి సంవత్సరానికి ఒక అవుపెడ్డను, రెండుపంచల బాధ్యత గలవానికి ఒకపాడి అవును భరణంగా యివ్వాలని శాసించాడు. ప్రతి ఎనిమిదవ రోజున అన్ని ఆవుల పాలు గోపాలకులు తీసుకోవచ్చును.[22] వేతనము వస్తు రూపంలో కూడ తీసుకోవచ్చని మనుస్మృతిలో వున్నది. రొక్కానికి బదులు పాలుతీసుకోదలచినట్ల యితే యజమాని అనుమతి పొంది ప్రతి పది ఆవులలోను ఉత్తమ మయిన ఆవు పాలు తీసుకుపోవచ్చును.[23] వేతనము గురించియే ఒప్పం దము లేనప్పుడు యీ సూత్రమే వర్తిస్తుందని గూడ మనువు చెప్పి యున్నాడు.

కౌటిల్యుని పాలనలో సమయపాలన పాటించని గోపాలకుల వేతనము పట్టుకోబడేది.[24] అనగా వుద్యోగనియమాలలో సమయ పాలనకు అధికప్రాధాన్యం యివ్వబడుతుందేదని స్పష్టమవుతున్నది.

## గోపాలకుల విధులు

గోపాలకుల విధులలో ముఖ్యమైనది పశువులను ఉదయం మేతకు తీసుకువెళ్లి సాయంత్రం యింటికి చేర్చడం.[25] పాలు పితకడం, గోవుల గురించి తగు జాగ్రత్త తీసుకోవడం, తప్పిపోకుండా చూడడం,

యితరుల చేనులలో ప్రవేశించి వారిపైరులకు నష్టము కలిగించకుండా చూడడం మొదలయినవి గూడ వీరి విధులలో వున్నాయి. అజాగ్రత్తగా మెలిగినా, కర్తవ్య నిర్వహణ చేయక పోయినా చట్టరీత్యా శిక్షార్హులౌతారు. నష్టపరిహారం చెల్లించమనడమే గాక, ద్రోహం తలపెట్టిన వారిని వురితీయడం కూడా జరిగేదంటే అనాటి చట్టాలు ఎంత కఠినంగావుండేవో బోధపడుతుంది. తన అధీనంలో వున్న పశువులు ఎవరికైనా నష్టము కలుగజేస్తే దాని బాధ్యత ఆ పశువుల కాపరిదే యని గౌతముడు చెప్పాడు.26 తన సంరక్షణలో వున్న పశువులను ఎవరికీ చెప్పకుండా విడిచివెళ్లిపోయిన గోపాలుడిని బెత్తము దెబ్బలతో శిక్షించాలని27, ఆ పశువుల బాధ్యత వేరొకరికి యిచ్చివేయాలని ఆపస్తంబుడు శాసించాడు.28 గోపాలకుని అజాగ్రత్త వలన పశు నష్టం కలిగితే అతడు పశువుల యజమానికి పరిహారం చెల్లించుకోవలసి వుంటుంది.29

"అర్థ శాస్త్రము" ద్వారా గూడ గోపాలకుల బాధ్యతలు, బాధ్యతలను గురించి మనకు కొన్ని నియమాలు తెల్లమవుతున్నాయి. అనేక కారణాలవలన పశునష్టము సంభవించవచ్చును గాని గోపాలకుని అజాగ్రత్త వలన అది జరిగితే అతనిచే యజమానికి పరిహారము యిప్పించవలసి వుంటుందని కౌటిల్యుని అభిప్రాయము.30 గోపాలకుల బాధ్యతలను గురించి వివరిస్తూ ముసలి పశువులను, బలహీనమైన పశువులను, పశువుల శిశువులను సురక్షితమైన ప్రదేశాలలో మేపి వాటిని దొంగల బారినుండి, కుక్కల బారినుండి రక్షించుట వారి కర్తవ్యమని కౌటిల్యుడు వ్రాశాడు.31 పశువులు నీళ్లుతాగటానికి, స్నానము చేయటానికి నదిలోకి వెళ్లినప్పుడు అతడు అతిజాగరూకుడై వుండాలి.32 పశునష్టం జరిగితే వెంటనే గో అధ్యక్షునికి తెలియబరచాలి, లేకపోతే నష్టపరిహారం చెల్లించుకోవాలి.33 పశువులు సహజంగా చనిపోయినట్లయితే గోపాలకుడు వాటి చర్మాన్ని తెచ్చి చూపించాలి.34 అయితే తర్వాత అది సహజ

మరణముకాదనీ, గోపాలకుడు దుష్ప్రవర్తనకు లోనయ్యాడనీ తేలినట్లయితే అతడు మరణదండానికి పాత్రుడవుతాడు[35]. రాచ గోవులను యితర గోవులతో మార్చినందుకు దీనికి కొంచెము తక్కువగా శిక్ష విధింపబడేది.[36]

ఇంతకూ విశద మవుతున్న దేమంటే గోపాలకుడు పశువుల యజమానికి ద్రోహముతలపెట్టక తన విధినిర్వహణ సక్రమముగా జరిపినంతవరకు అతనికి యెట్టి ఆపదలేదు. కాని నిర్లక్ష్యంగానూ, విద్రోహకరంగానూ ప్రవర్తించినట్లయితే శిక్షార్హుడవుతాడు. కౌటిల్యుని వలెనే మనువు గూడ గోపాలకుల అధీనంలో వున్నంత కాలం రాత్రి యినా పగలయినా పశువులకు ఎట్టి ప్రమాదం జరిగినా వారే బాధ్యత వహించవలసివుంటుందని అభిప్రాయపడ్డాడు.[37]

మనువు యీ సూత్రాన్ని యింకా విపులంగా వివరించాడు.[38] అయితే పశువులు కంచెలేని చేలలో దూరి పైరును తిన్నా, నష్టపరిచినా గోపాలకుని బాధ్యత వుండదన్నాడు.[39] తరువాత కొన్ని శతాబ్దములకు నారదుడుగూడ గోపాలకుల విధులు, బాధ్యతలు గురించి దాదాపు యివే అభిప్రాయాలను ప్రకటించాడు. గోపాలకుడు తన అధీనంలోవున్న పశువులను ప్రమాదమునుండి కాపాడలేకపోయినా, యజమానికి విషయము సరియైన సమయానికి తెలుపకపోయినా నష్టపరిహారం చెల్లించటమేగాక కొంత అపరాధం గూడ రాజుకు కట్టుకోవాలని నారదుడు ప్రవచించాడు.[40]

ఈ విధంగా పశువుల కాపరులకు యజమానులకు మధ్య యేర్పడిన వివాదాలు అప్పుడు అమలులోవున్న చట్టాల ప్రకారం పరిష్కరించబడేవి. బుద్ధిపూర్వకంగా దుష్ప్రవర్తన చేయడం, నిర్లక్ష్యంగా వుండడం

నియమనిబంధనలను పాటించకపోవడం మొదలయిన నేరాలకు తగి
శిక్ష విధించబడినప్పటికే, హృదయపూర్వకంగా పని నిర్వహణ జరిపిన
వారికి, పశువులను యిబ్బందులనుండి తప్పించడానికి తగు ప్రయత్నం
చేసినవారికి ఎట్టి బాధ్యతల బరువు వుండేదికాదు. ఆనాటి అనాగరిక
పరిస్థితులను దృష్టిలో వుంచుకుని విచారిస్తే యీ వుద్యోగ నిబంధనలు,
యజమానులకు కార్మికులకు మధ్య సంబంధాలు న్యాయసమ్మతంగానూ,
తృప్తికరంగానూ వున్నాయనటంలో సందేహంలేదు.



# నాలుగవ అధ్యాయము

## ప్రాచీన భారతదేశములో వేతనాలు, ఉద్యోగ నియమాలు

ఇప్పటివలెనే ప్రాచీన కాలంలోగూడ కార్మికులను జీతాలమీద నియోగించడం జరిగేది. కార్మికుల జీతాలనంటిపెట్టుకుని పారిశ్రామిక శాంతికి సంబంధించిన అనేక సమస్యలు ఉద్భవిస్తూ వుండేవి యజమానికి కార్మికునికి మధ్య "యింత జీతానికి యింతపని చేయాలి" అని అంగీకారాలుకుదిరేవి. జీతాల నిర్ణయం యజమానికి కార్మికునికి మధ్య బేరసారాలకు గురియైవుండేది. వేతననిర్ణయంలో యిరుపక్షాలవారు అధిక అవకాశాలకై కొట్టుకులాడేవారని తెలుస్తున్నది. ముఖ్యంగా కాలము, పని—యీరెంటి ఆధారంగా యీ బేరాలునడిచి చివరికి ఒక నిర్ణయం జరిగేదని కౌటిల్యుని అర్థశాస్త్రము తెలుపుతున్నది. ఇదిగాక వేతన నిర్ణయాలకు పనికివచ్చే కొన్ని నిశ్చితమైన సూత్రాలు గూడా అమలులో వుండేవి. ఉదాహరణకు ముందుగా వేతననిర్ణయం జరుగకుండా ఉద్యోగం చేసినవారికి ఉత్పత్తిలో దశమ భాగాన్ని తీసుకునే అర్హతవుంటుంది.[2] అయితే వైద్యులు, న్యాయవాదులు, చేతివృత్తులవారు, గాయకులు మొదలయిన నిపుణులకు యితర స్థలాలలో చెల్లించబడే విధంగానో లేక ప్రతిభావంతులు నిర్ణయించినట్లుగానో వేతనాలు యివ్వాలని కౌటిల్యుడు సూత్రీకరించాడు.[3]

ప్రభుత్వంలో పనిచేసే వుద్యోగులకు నియమిత ధరల ప్రకారం జీతాలు కట్టి యివ్వాలనిగూడ కౌటిల్యుడన్నాడు.[4] జ్యోతిష్యులు, రథ

సారధులు, పూజారులు, రథకులు, గాయకులు, విభిన్న శాఖాధిపతులు అయినవారికి వెయ్యిపణముల చొప్పున, శస్త్రకులకు, గుమాస్తాలకు, మున్షీలకు అయిదువందల పణముల చొప్పున, సామాన్య కార్మికులకు (చేతి పనులవారు, వడ్రంగులు మొదలయినవారు) నూటయిరవై పణ ముల చొప్పున, అంతరంగిక భృత్యులకు, గోపాలురులకు అరవై పణములచొప్పున, సంగీతాది కళాకారులకు, విదూషకులకు 250 పణ ములచొప్పున సాలుసరి జీతాలు నిర్ణయించబడెను. మంచిరౌతులకు, గనులలో పనిచేసేనిపుణులకు, శిల్పులకు, ఉపాధ్యాయులకు, వేదపఠ కులకు వారి యోగ్యతలనుబట్టి 500 నుండి 1000 పణములవరకు యిచ్చేవారు. గ్రామాలలోని చాకలి, మంగలి, మొదలయిన వారికి, గూఢ చారులకు, గ్రామాధికారులకు 500 పణములు లభించేవి. వార్తాహారు లకు యోజనానికి పదినుండి ఇరవై పణముల చొప్పున యిచ్చేవారు[6]. కౌటిల్యునికాలములో వారివారి సామర్థ్యాలనుబట్టి అరవై నుండి వెయ్యి పణములవరకు వార్షికవేతనము లభించేది. అంటే రోజుకు పణములో ఆరోవంతు నుండి రెండుమువ్పాతిక పణములవరకు జీతముగల వుద్యో గులుండేవారు.

కౌటిల్యునిద్వారానే వేతనాలను గురించి యింకా మెన్నోవివరాలు మనకు తెలుస్తున్నాయి. ఉదాహరణకు నూలుబట్టలునేసేవారికి నూలు వెలకు సమానముగా జీతము, పట్టుబట్టలునేసేవారికి పట్టుదారపువెలకు ఒకటిన్నర రెట్లుజీతము, వున్నిబట్టలునేసేవారికి వున్నిపోగు వెలకు రెండింతల జీతము యివ్వాలని వున్నది[7]. అంటే సాలెపనివారికి ఖచ్చి తమైన జీతాలేమీలేవుగాని వారుచేసేనూలువిలువపై వారిజీతము ఆధార పడివుండేది. ఇట్లాగే చాకలివారికి బట్టలు వుతకటానికి, రంగులద్దటానికి వేర్వేరుగా జీతాలరేట్లు నిర్ణయింపబడెను. బాగా వుతికినందుకు ఒక

పణము. మధ్యరకంగా వుతికినందుకు అరపణము, మామూలుగా వుతికినందుకు పావుపణము జీతము లభించేది.[8] బేధాభిప్రాయాలు వచ్చి నప్పుడు విపుణుల ద్వారా వేతన నిర్ణయాలు జరిగేవి.[9] చాకలి వారికిచ్చే పద్ధతిలోనే దర్జీలకు, సాలెవారికి జీతాలుండేవి.[10] కమసాలివారు వెండి ఆభరణాలు చేసినందుకు ఆభరణము ఒకటికి ఒక మాసమువంతున, బంగారు ఆభరణాలైతే బంగారం విలువలో ఎనిమిదోవంతు మజ్దూరీ తీసుకునేవారు. "అసాధారణమైన పనితనం చూపించినందుకు యింతకు రెండింతలు యివ్వబడేది. రాగి, యిత్తడి, సీసము, కంచు, యినుము మొదలైన లోహాలతో వస్తువులు చేసినందుకు అట్టిలోహాల వెలలో అయిదవశాతము మజ్దూరీ లభించేది.[12]

కౌటిల్యునికి పూర్వము జాతకముల కాలములోగూడ వేతనాల గురించి చెప్పబడివున్నది. గంగమాల జాతకములో నీళ్ళకావిడి మోసే వారికి రోజుకు అర్ధమాసం వెండి యివ్వబడేదని వ్రాసివున్నది.[13] విస హ్య జాతకములో గడ్డి కోసేవారికి రోజుకు ఒకమాసం వెండి యిచ్చే వారని వున్నది. జాతకములలో యింతకుమించి వేతనాల విషయములో మనకేమీ తెలియడం లేదు.

మనువు వేతనాలు నిర్ణయించడములో జరిగే ఒప్పందాలను గురించి వ్రాసివున్నాడుగాని యిదమిత్థంగా వేతనాలకు యీ ధరలు వుండాలని చెప్పలేదు. మనుస్మృతిలో యీ విషయంపై మనకు కొంత సమాచారం లభిస్తున్నది. శూద్రునికి పోషణ యిచ్చేటప్పుడు అతని యోగ్యతలు, చేయవలసినపని, అతనిమీద ఆధారపడివున్నవారి సంఖ్యను యజమానులు దృష్టిలో వుంచుకోవాలి.[14] గోపాలకుడు కోరుకున్న ట్లయితే అతని వేతనము వస్తు (పాలు) రూపములో యివ్వవచ్చును. అతడు ప్రతి పది ఆవులలోను మంచి ఆవునుపిండుకొని పోవచ్చును.[15] ప్రభుత్వము క్రింద పని చేసేవారికి కొన్ని నిర్ణీత వేతనాలు మనువు

యేర్పాటు చేశాడు. ఉదాహరణకు పరిచారికలకు, వార్తాహరులకు, రాజ భృత్యులకు వారి హోదానుబట్టి, చేయవలసిన కృషినిబట్టి జీతమివ్వాలి.[16] మోటుపని చేసేవారికి రోజుకు ఒక పణము, నైపుణ్యపు పని చేసేవారికి రోజుకు ఆరుపణములు యివ్వాలి. ఇదిగాక మోటుపనివారికి నెలకు ఒక ద్రోణము ధాన్యము, ఆరునెలలకు ఒక వస్త్రము, నిపుణులైన పనివారికి నెలకు ఆరు ద్రోణముల ధాన్యము, ఆరునెలలకు ఆరు వస్త్రములు లభించేవి.

మనుస్మృతిపై కుల్లూకభట్టు వ్యాఖ్యానములో యీ విషయ మింకా స్పష్టముగా వున్నది.[16(a)] ఇరుపక్షాలు బేరమాడి వేతనం నిర్ణయించుకునే పద్ధతిని గురించి యాజ్ఞవల్క్యుడుగూడ వ్రాశాడు. వేతనము నిర్ణయించకుండా పనివాళ్ళను నియమించిన యజమాని శిక్షింపబడాలనీ అట్టి పనివారికి యజమాని ఆదాయములో పదోవంతు పరిహారంగా యిప్పించాలని యాజ్ఞవల్క్యుని నిర్దేశము.[17] యాజ్ఞవల్క్యస్మృతిపైన వ్రాయబడిన మితాక్షర వ్యాఖ్యానములో పనివాళ్ళను నియమించే ముందే వేతనాల నిర్ణయం జరగాలని, తదుపరి పేచీలువచ్చే అవకాశం వుండరాదని యాజ్ఞవల్క్యుడు అభిప్రాయ పడినట్లు స్పష్టీకరించబడింది.

కౌటిల్య, యాజ్ఞవల్క్యులవలెనే నారదుడుగూడ వేతనములు మొదట అనుకున్నంత, అనుకున్నవిధంగా చెల్లింపబడాలనే హంశానికి ప్రాముఖ్యత యిచ్చాడు.[18] అంటే ఉద్యోగ ఒప్పందము చేసుకునే ముందే యజమాని, ఉద్యోగి బేరమాడి వేతనము నిర్ణయించుకోవాలని ఆయన అభిలాష. ముందుగానే వేతన నిర్ణయము జరగకపోతే న్యాయంగా యజమాని ఆదాయములో దశమభాగం ఉద్యోగి తీసుకోవాలనటంలో నారదుడు యాజ్ఞవల్క్యునితో ఏకీభవించాడు.[19]

ప్రాచీనకాలపు ప్రముఖ న్యాయవేత్తయిన బృహస్పతిగూడ ఉద్యోగ ప్రారంభములో అనుకొన్నట్లుగా జీతాలు యివ్వబడవలసిందే నని చెబుతూ జీతాలు రోజువారీగానో, పక్షవారీగానో, నెలవారీగానో, మూడునెలల వారీగానో, ఆరునెలల వారీగానో. ఉద్యోగ పూర్తితోనో యిచ్చే యేర్పాట్లుండవచ్చు నన్నాడు.[20] అయితే ముందుగా వేతన నిర్ణయముగాని పక్షంలో యజమాని ఆదాయములో పదోవంతు ఉద్యోగికి లభించాలని యితర గ్రంధకర్తలు చెప్పిన సూత్రంతో బృహస్పతి ఏకీభవించలేదు. మూడోవంతో, అయిదోవంతో చెల్లించాలని బృహస్పతి నిర్దేశము. పనివాడికి అన్నము, బట్ట యిచ్చినట్లయితే ఉత్పత్తిలో గాని, లాభములోగాని అయిదోవంతు అతనికి జీతంగా యివ్వాలని, అట్టి యేర్పాటు లేకున్నట్లయితే మూడోవంతు ముట్టచెప్పాలని బృహస్పతి విపులీకరించాడు.[21]

నేపాళ దేశంలోనూ, దాపులోవున్న భారత భూభాగంలోనూ క్రీ.శ. 625 లో అమలులోవున్న వేతన ప్రకారములను ప్రొఫెసర్ సిల్వియన్‌లీ ప్రకటించి వున్నాడు. అవి యీ దిగువ పంక్తికలో వున్నాయి.[22]

| శారీరక కష్టముచేయువారు, భృత్యులు | రాగిపణములలో వేతనములు. సాలుసరి | నెలసరి | రోజుకు |
|---|---|---|---|
| 1. అభిషేఖ–హస్తిన (గజచోదకుడు) | 588 | 49 | $1\frac{1}{2}$ |
| 2. అభిషేశాశ్వ (అశ్వచోదకుడు) | 588 | 49 | $1\frac{1}{2}$ |
| 3. ధావకగేచ్ఛి (వార్తాహరుడు) | 588 | 49 | $1\frac{1}{2}$ |
| 4. పూజారి | 588 | 49 | $1\frac{1}{2}$ |
| 5. ఛందా | 408 | 34 | 1 |

| | | | |
|---|---|---|---|
| 6. కామరధార, పీఠాధ్యక్ష (అంతరంగిక భృత్యులు) | 408 | 34 | 1 |
| 7. ధ్వజమనుష్య, పుష్పవతావక (ధ్వజమును మోసేవారు) | 408 | 34 | 1 |
| 8. నీళ్ళకావాడి మోసేవారు | 408 | 34 | 1 |
| 9. రాజభవన పరిచారకులు | 408 | 34 | 1 |
| 10. ద్వారపాలకులు | 240 | 20 | 2/3 |
| 11. చీపురు పనివారు | 240 | 20 | 2/3 |
| 12. రహదార్ల పహారాదారు | 240 | 20 | 2/3 |
| 13. సైనికుడు | 408 | 34 | 1 |
| 14. గౌష్ఠిక (గోపాలకుడు) | 408 | 34 | 1 |
| 15. సేనాపతి | 3,800 | 320 | 10 |

క్రీ. శ. 900 నాటి ప్రఖ్యాత న్యాయవేత్త శుక్రాచార్యుడు కార్మికులను బద్ధకస్తుడు, సామాన్యుడు. చురుకైనవాడు అని మూడురకములుగా విభజించి వీరి వేతనాలనిర్ణయం యిదేక్రమంలో జరగాలన్నాడు.[23] జీవితపు కనీస అవసరాలకు సరిపోయేదైతే సామాన్యవేతనమని, కావలసినంత తిండి, బట్టకువచ్చేదైతే ఉన్నతవేతనమని, కడుపు నిండేందుకుగూడ సరిపోనిదైతే అల్పవేతనమని వేతనాలను విభజించాడు.[24] కార్మికుని యోగ్యతలకనుగుణంగా యీ వేతనాలు యేర్పడాలి.[25]

కాలమునుబట్టిగాని, పనినిబట్టిగాని, రెండింటినీబట్టిగాని వేతనాలు నిర్ణయించవచ్చును.[26] అంటే ప్రాచీనకాలములో మనదేశములో కాలపురేటు, పనిరేటు రెండూవుండేవనితెలుస్తున్నది. ఈ పద్ధతులను శుక్రాచార్యుడు సోదాహరణముగా వివరించియున్నాడు. యజమాని కార్మికునితో "యింత పనిజేస్తే యింత జీతమిస్తాను" అనేది పనిరేటు.[27]

"ఏడాదికి యింత, లేక నెలకింత యిస్తాను" అనేది కాలపు రేటు.[28] "ఇంతకాలంలో యింతపని చేశావుగాబట్టి యింత జీతమిస్తున్నాను" అంటే జీతము కాలము, పని రెంటినీబటి నిర్ణయించబడిందన్నమాట.[29]

కార్మికుని జీవితావసరాలను తీర్చగలట్లుగా వేతననిర్ణయం జరగాలని శుక్రాచార్యుని అభిప్రాయము.[30] ఎందుకంటే కడుపునిండే జీవితముదొరకక అతడు నిరాశజెంది యజమానికి శత్రువుగామారే అవకాశమున్నది. అవకాశవాదిగానూ, బాధ్యతారహితుడుగానూ పరివర్తనజెందవచ్చును.[31] ఆధునిక పారిశ్రామిక తత్వజ్ఞులుగూడ ఆకలి బాధచే పీడించబడే కార్మికుడు చిత్తశుద్ధితోనూ, విశ్వాసపాత్రంగానూ పనిచేయజాలడని చెబుతున్నారు. యజమానులకు, కార్మికులకుమధ్య సత్సంబంధాలు పెంపొందాలంటే న్యాయమైన వేతనాలిచ్చి కార్మికులను తృప్తులుగావుంచవలసి వుంటుందనే అభిప్రాయం వెలిబుచ్చి శుక్రాచార్యుడు ఆధునిక పారిశ్రామిక కార్మిక తత్వవేత్తల ఆలోచనలతో తులతూగాడు. ఇంతజరిగినప్పటికీ శూద్రులు పీడితవర్గముగానే మిగిలిపోయారు. వారికి లభించేవేతనాలతో పొట్టనింపుకోవడం దుర్లభంగానే వుండేది.[32]

## వేతన వితరణ

దాదాపు అందరున్యాయవేత్తలూ వేతనాలు రోజువారిగానో, వారంవారిగానో, పక్షంవారీగానో నెలవారీగానో, మూడునెలలవారీగానో, ఆరునెలలవారీగానో, ఏడాదివారీగానో లేక పని ముగిసినమీదటనో మొదట అనుకొన్నప్రకారం చెల్లింపబడాలని ఏకాభిప్రాయం ప్రకటించారు. పని సరిగా చేయకపోయినా, పని అసలుచేయకపోయినా జీతం పట్టుకోవలసిందే.

వేతనాల వితరణ విషయములో కొన్ని సూత్రాలు చేయబడ్డాయి. జీతాలు మొదట చేసుకున్నఒప్పందాన్ని అనుసరించి చెల్లింపబడాలని.

మొదట నిర్ణయించుకోకపోతే కాలము, పనినిబట్టి లెక్కచేసి చెల్లించా లనీ, కౌటిల్యుడు నిర్దేశించారు.[33] జీతాలు చెల్లించేటప్పుడు తగాదావచ్చి నట్లయితే సాక్షులుచెప్పినరేట్లచొప్పున సాక్షులులేనట్లయితే చేసినపని ఆధారంగానో చెల్లించివేయాలి.[34] ఎవరైనా పనిని సక్రమంగాచేయక పోతే వారంరోజులజీతం పట్టుకోవచ్చును. అప్పటికి ఆపని అసంతృప్తి కరంగా జరుగుతున్నట్లయితే ఆఉద్యోగిని తొలగించి ఆపనిని మరొకరికి అప్పగించవచ్చును.[35]

ఒకవ్యక్తి పనిచేసేందుకు తయారై వచ్చినప్పటికి అతనిచేత పని తీసుకోబడనట్లయితే అతనికి జీతమివ్వనక్కరలేదు. అంటే జీతమివ్వ డం పనిచేసినందుకుమాత్రమేనని స్పష్టపడుతున్నది. పనిచేసేందుకు సిద్ధపడివస్తేనేచాలు జీతమివ్వాలిసిందేననే యితరప్రాచీనులవాదంతో అంగీకరించనని కౌటిల్యుడు స్వయంగా చెప్పుతున్నాడు.[36] పైపెచ్చు యజమాని నిర్దేశించిన స్థలములో, సమయములో యిచ్చినపని చేయు నట్టి కార్మికునికి యెట్టి జీతము యివ్వనక్కరలేదన్నాడు.[37]

మొదట ఒప్పందం చేసుకున్న పనికిమించి యజమాని ఆదేశం ప్రకారం కొంత ఎక్కువ పని చేయవలసివస్తే అందుకు వేరే జీతం కట్టి యివ్వనక్కరలేదు.[38] ఈసూత్రము అన్యాయంగానే కనిపిస్తున్నది. అయితే "అర్థశాస్త్రము" రచింపబడిన కాలములో భారతదేశము క్లిష్ట మైన ఆర్థిక స్థితిలో వున్నందువలన యిటువంటి విధానాలు ప్రవేశపెట్ట బడినాయని కొందరు చరిత్రకారులు చెబుతున్నారు. బహుశః అట్టి స్థితిలో యీ సూత్రము న్యాయసమ్మతంగానే తోచివుండవచ్చును. "అర్థ శాస్త్రము"లో ఒకచోట ప్రత్యేకమైన జీతాలిచ్చి శెలవు దినాలలో కార్మి కులచేత పనిచేయించుకోవచ్చునని వ్రాయబడివున్నది.[39] అంటే ఆ రోజులలో అధికోత్పత్తికై శ్రద్ధతీసుకోబడేదని అవగాహన అవు తున్నది.

గోపాలకులకు, వ్యవసాయ కార్మికులకు ధాన్యంతోపాటు నెలకు 1¼ పణములు చెల్లించబడెనని కూడ "అర్థశాస్త్రము"లో వున్నది.[40] ఇందువలన వ్యవసాయ కార్మికులకు జీతము ఎక్కువ రొక్కములో గాక వస్తురూపములో యివ్వబడుతుండేదని మనకు తెలుస్తున్నది. చేతి పనులవాళ్ళకు పనిని బట్టి ధాన్యము, రొక్కము యివ్వబడేది.

యాజ్ఞవల్క్య శాసనం ప్రకారంగూడ చేసినపని ఆధారంగానే జీతమివ్వబడేది. సమిష్టిగా చెయ్యాలని యిద్దరికి అప్పగించబడిన పనిని ఆ యిద్దరూ పూర్తిచేయలేకపోతే చేసినంతవరకు మాత్రమే జీతమివ్వాలనీ, మొత్తము పనిని పూర్తిజేసిన మీదటనే అనుకున్న పూర్తిజీతము చెల్లించాలనీ యాజ్ఞవల్క్యుడు సూత్రీకరించాడు.[41]

జీతాలు ఏ సమయములో చెల్లించాలనే విషయముమీద నారద బృహస్పతులు యితర న్యాయవేత్తలతో అంతగా భేదాభిప్రాయము తెలుపలేదు. చేసుకున్న ఒప్పందం ప్రకారంగా పని ఆరంభములోగాని మధ్యలోగాని, ముగింపుతోగాని జీతాలు చెల్లించవచ్చునన్నాడు నారదుడు.[42] రోజువారీగానో, పక్షవారీగానో, నెలవారీగానో, మూడునెలల వారీగానో, ఆరునెలలవారీగానో, ఏడాదివారీగానో, పని ముగించిన మీదటనో మొదట అంగీకరించుకున్నట్లుగా జీతాలు చెల్లించాలని బృహస్పతి అభిప్రాయము.[43]

శుక్రాచార్యుడు కాలమును సూర్యమానముగానూ, చంద్రమానముగానూ, "సావన" పద్ధతిగానూ విభజించాలని చెప్పుతూ రోజువారీ జీతాలకు "సావన" పద్ధతిని ప్రయోగించాలన్నాడు.[44] పైగా జీతాల చెల్లింపు సమయానికి తప్పనిసరిగా జరగాలనీ ఆపగూడదనీ వాయిదాలు వేయరాదనీగూడ ఆయన అన్నాడు.[45]

చేసుకున్న ఒప్పందాల ప్రకారం జీతాల చెల్లింపు జరగాలనీ పని పూర్తిగానూ, సక్రమంగానూ చేయబడకపోయినప్పుడు మాత్రమే జీతాలుపట్టుకోవడం జరగవచ్చుననీ అందరు ప్రాచీనన్యాయవేత్తలు సూత్రీకరించారు. కౌటిల్యునికాలములో పనికోసం వచ్చినందుకుగాక పనిచేసినందుకే జీతాలివ్వాలనేసూత్రం పాటించబడింది. ఇచ్చినపని పూర్తిగాచేయనట్లయితే చేసినపనికే జీతమునిష్పత్తిలో కట్టియివ్వబడేది.

ఉద్యోగనిబంధనలు-

ప్రాచీన భారతదేశంలోవున్న వుద్యోగనిబంధనలను గురించి తెలుసుకోవాలంటే "అర్థశాస్త్రము" ఒక్కటే మనకుముఖ్యాధారముగా వున్నది. పూర్వకాలములో యీ విషయముగురించి శ్రద్ధవహించినది ఒక్కకౌటిల్యుడనేచెప్పాలి. శుక్రాచార్యునిపేరుగూడ యీ సందర్భములో స్మరించతగినదే.

వేతనవితరణగురించి, ఉద్యోగపు ఒప్పందాలగురించి, మహిళ కార్మికుల పనివిధానము గురించి, శెలవులగురించి, యితరపారిశ్రామిక సంబంధాలను గురించి అనేకసూత్రాలు మనకు అవగతమవుతున్నప్పటికి, ప్రభుత్వయజమాన్యంలోనూ, వ్యక్తిగత యజమాన్యంలోనూ వున్నప్పటి కర్మాగారాలలో పనిచేసికార్మికుల వుద్యోగనిబంధనలను గురించిగాని, పనివేళలను గురించిగాని మనకు యెట్టిఆచూకి దొరకటం లేదు. అయితేపరిస్థితులు బాధాకరంగాలేవని, అనుకూలంగానే వుండేవని తీర్మానించబడుతున్నది. ఎందుకంటే బాధాకరమైన వుద్యోగనిబంధనలమూలంగా పారిశ్రామిక అలజడి జరిగివుంటే యీ నిబంధనలను గురించి యీ సుప్రసిద్ధన్యాయవేత్తలు వ్యాఖ్యానించి వుండేవారేగదా. అయితే ఎట్టిపరిస్థితిలోనూ క్రోధావేశాల ప్రకటించటం మహాపాపమనే

ప్రాచీనుల ఛాందసత్వమే ఎట్టిఅలజడి లేకపోవటానికికారణమై వుండ వచ్చని వాదించేవారున్నారు. కాని మానసిక తత్వశాస్త్రముప్రకారము సహింపరానంతగా పరిస్థితి విషమించినట్లయితే ఎట్టిమానవుడైనా ఏదో రూపములో తన నిరసనప్రకటించకుండా వుండలేడుగాబట్టి యీ వాదన అంగీకారయోగ్యము కాజాలదు. సహనశక్తికిగూడ మితిఅంటూ వుంటుంది గనుక వుద్యోగము వూడిపోతుందన్నభయముగూడ మనిషి ఆవేశమును అపజాలదు. కాబట్టి నిజంగా ఆరోజులలో దుస్సహమైన కార్మికపద్ధతులుండివున్నట్లయితే యిన్నివుత్తమసూత్రాలు ప్రవేశపెట్టిన యీ న్యాయవేత్తలు యీ విషయములో నిశ్శబ్దంగా వుండేవారుగారు

యజుర్వేద కాలమునుండే పరిశ్రమలలో శాంతి సుహృద్భావాలకు ఎంతో ప్రాధాన్యత యివ్వబడింది. కార్మికులు పనిచేసే స్థలాలలో మనశ్శాంతితోపనిచేయాలనీ, యింటికి తిరిగి వెళ్ళేటప్పుడు వుల్లాసంగా వుండాలనీ యజుర్వేదంలో వ్రాయబడి వున్నది.[46] ఉద్యోగ పరిస్థితులు తృప్తికరంగా వుంచేనేగాని కార్మికులలో యిట్టి శాంతి కలగదు. ఆ రోజులలో భారీఎత్తున పారిశ్రామిక వుత్పత్తి జరిగేదికాదు గనుక యజమానులకు కార్మికులకు మధ్య వ్యక్తిగతమయిన తృప్తికరమయిన సంబంధాలు వుండివుండాలి.

ప్రాచీనకాలములోని బానిసత్వముగురించి యింతకుముందు ప్రస్తావించినప్పుడు కౌటిల్యుడు బానిసలచేతగూడ అపమానకరమైన పని చేయించటం నిషేధించాడని తెలుపబడింది. ఎనిమిది సంవత్సరముల ప్రాయములేని పిల్లలను పనికి నియోగించటానికి, అమ్మటానికి, కొనటానికి కౌటిల్యుడు యిష్టపడలేదు. ఈ విధంగా బానిసల వుద్యోగ నిబంధనల విషయములో తగు జాగ్రత్త తీసుకోబడింది. వేతనార్జనకు

వచ్చే మహిళ కార్మికుల పనివిషయములో తగు నిబంధనలు చేయ బడ్డాయి[47]

కార్మికుల సమయపాలన గురించి చాల గట్టి యేర్పాట్లు చేయ బడినాయి. నిర్ణీత సమయందాటి పనికివచ్చిన కార్మికులనుండి వారి జీతంలో చతుర్థభాగము తగ్గించటము యింతకు రెట్టింపు అపరాధము విధించటము జరిగేది. తనకు వశంకాని కారణాలచేత ఆలస్యం జరిగితే ఎట్టి తగ్గింపు వుండదు.[48]

## సెలవు నిబంధనలు.

ఒక కార్మికుడు అస్వస్థతవలన పనిచేయలేని స్థితిలోవుండే అతనిని పనిచేసేందుకు బలవంతపెట్టడం జరగదు. ఈ విషయములో న్యాయవేత్తలు విభిన్నమైన సూత్రాలు ప్రతిపాదించారు. కొందరు జీతముతో శెలవు యివ్వాలంటే మరికొందరు పనిచేయనివారికి జీత మివ్వరాదన్నారు. ఒక కార్మికుడు యిబ్బందిలోవున్నా, అస్వస్థతగావున్నా, పనిచేయలేనంత బలహీనంగావున్నా పనినుండి శెలవు తీసుకోవచ్చనీ, యితర కారణాలవలన శెలవడిగినట్లయితే తన స్థానములో మరొకరిని కుదిర్చి వెళ్ళాలనీ కౌటిల్యుడు అభిప్రాయపడ్డాడు.[49]

ఒకపనికి నియమింపబడిన వ్యక్తి అనారోగ్యమువలన ఆ పనిని పూర్తిచేయలేనప్పటికి, స్వస్థత చేకూరినతర్వాత దానిని పూర్తిచేసి నట్లయితే అతనికి పూర్తిజీతము యివ్వాలని మనువు ఆదేశము.[50] ఆరోగ్యవంతుడైన తర్వాతగూడ ఆపనిని పూర్తిచేయలేకపోతే అతడు జీతానికి అనర్హుడు.[51] అనగా అస్వస్థతవలన సెలవు తీసుకున్న కార్మికుడు తర్వాతవచ్చి తనపనిని పూర్తిచేసే పక్షంలో మాత్రమే

జీతముతో సెలవు యివ్వడం జరుగుతుందని మనువుయొక్క శాస నముల తాత్పర్యము.

బృహస్పతి యేర్పరచిన సూత్రాలప్రకారం పనిచేసే స్థితిలో లేని కార్మికునిచేత బలవంతంగా పనిచేయించరాదు. అయితే ధృఢ కాయుడైన కార్మికుడు పని ఎగవేసినట్లయితే శిక్షింపబడవలసినదే.

శెలవు విషయములో శుక్రాచార్యుడు ప్రవేశపెట్టిన సూత్రాలు చాలా సమంజసంగా వున్నాయి. ప్రతిరోజు పగలు. రాత్రి కార్మికునికి తగు విశ్రాంతి కలుగజేయటమేగాక పండగలు పర్వాలు వచ్చినప్పుడు చాలా అత్యవసరమైన పని లేకపోతే జీతంతో సెలవు యివ్వాలని ఆయన చెప్పాడు.[52]

కార్మికుడు చేసిన సేవలను దృష్టిలో వుంచుకొని అతడు అస్వ స్థతగావున్న సమయాలలో జీతముతో సెలవు యివ్వవలెను. ఒక వారం రోజులు అనారోగ్యంగా వుండిన కార్మికునికి జీతం కోయడం జరగరాదు.[53] ఇవన్నీగాక ప్రతి కార్మికుడు ఏడాదికి పదిహేను రోజులు జీతముతో సెలవు పొందవచ్చును.[54]

కాబట్టి అర్ధశాస్త్రము, మనుస్మృతి, శుక్రనీతికి సంబంధించిన దాదాపు పెద్దేళ్ళకాలములో యీ విషయాలకు సంబంధించిన సూత్రాలు చాలా న్యాయసమ్మతంగా వుండేవని మనకు తెలుస్తున్నది.

## కార్మికులకు కార్యప్రోత్సాహము.

ఉత్తమ ప్రమాణముగల పనిని ఎక్కువగా చేసినందుకు కార్మి కులకు తగిన పారితోషికము యివ్వబడేది. కార్మికుడు మామూలుపనిని చేసి చూపించినట్లయితే అతనికివ్వబడే జీతముకన్న కొంత

ఎక్కువ యివ్వవలసి వుంటుందని యజమానులను యాజ్ఞవల్క్యుడు ఆదేశించాడు.[55] కార్మికులకు జీతముగాక, బహుమాన రూపములో కొంత ముట్టజెప్పి వారిని వుల్లాసంగావుంచాలని కౌటిల్యుడుగూడ అంగీకరించాడు. నూలువడికే వారికి బహుమానాలిచ్చి ఆ శాఖాధిపతి వారిని వుల్లాసంగా వుంచాలనే అర్థముగల శ్లోకం మనముందర వున్నది.[56] ప్రభువు తన సేవకులకు వారి జీతములో ఎనిమిదోవంతు పారితోషికముగా యివ్వాలనీ శుక్రాచార్యుడన్నాడు.[57]

నైపుణ్యముగల పనితనము, ఉత్తమ పని ప్రమాణమును సాధించిన కార్మికులకు యితోధికంగా ప్రోత్సాహమివ్వబడేది. కార్మికపని క్రియానైపుణ్యము గుర్తించబడడమేగాక పని హెచ్చుగానూ, చురుకుగానూ చేయుటకు అవసరమైన ఆకర్షణలు కల్పించబడేవనీ ఒకానొక శ్లోకములో వున్నది.[58]

మొత్తముమీద ప్రాచీన భారతదేశములో కార్మికుల ఉద్యోగ నిబంధనలు, వేతనాలు అసంతృప్తికరంగా లేవని గట్టిగా చెప్పవచ్చును.



# అయిదవ అధ్యాయము

## సాంకేతిక వృత్తివారీ శిక్షణ

---

ఏకళనైనా తగినశిక్షణ, గురుబోధలేనిదే నేర్చుకోలేమన్నది అందరు యెరిగిన సత్యమే. ఈ సత్యం గుర్తించబడినందువల్లనే పురాతనకాలములో సాంకేతిక, వృత్తివారీ శిక్షణలకు మిక్కిలి ప్రాధాన్యత యివ్వబడింది. పురుషులకు ముఖ్యంగా వైశ్యులకు వివిధ కళలలోనూ, పనులలోనూ నిపుణులైన ఆచార్యులవద్దనో లేక శిక్షణశాలలలోనో తగు శిక్షణ యిచ్చేవారని ప్రాచీన ధర్మగ్రంథాలలో పేర్కొనబడి వున్నది. జాతకాల కాలమునాటికే యిట్టి శిక్షణయిచ్చే ఆచార్యులనుగురించి,పొందే శిక్షణార్థులను గురించిన ప్రసక్తి మనకు లభిస్తున్నది. వరుణి, కూస జాతకములలో శిక్షణార్థుల విషయముల్లేఖించబడింది. ఈ పద్ధతి నేటి వరకు అమలులో వున్నదని వేరే చెప్పనక్కరలేదు.

శిక్షణార్థిని ఆరోజులలో "అంతేవాసీ" అనేవారు. ఏదైనా కళలలోనూ, వృత్తిలోనూ శిక్షణపొందాలంటే అతడందులకు నిర్దేశించబడిన కాలము ఆచార్యునివద్దనేవుండిపోవాలి. తననుతాను ఆచార్యునిసేవకునిగా భావించుకొని ఆయనకు శుశ్రూషచేయాలి. ఆచార్యుడు అంతేవాసీకి అన్నవస్త్రములు, గృహవసతి కలిగించి కోరినవిషయములో శిక్షణయిచ్చేవాడు. శిక్షణార్థి అసాధారణప్రజ్ఞను ప్రదర్శించినట్లయితే అతనికి తగువిధముగా పారితోషికములిచ్చి ప్రోత్సహించేవాడు. ఇటువంటివారికి వెయ్యి "కర్షపణములు" బహుమానము యిచ్చేవారని కూస జాతము (531)లో వ్రాయబడివున్నది.

జాతకములుగాక యాజ్ఞవల్క్యస్మృతి, నారదస్మృతి వంటి శాసన గ్రంథాలలోగూడ యిట్టి శిక్షణ గురించి చెప్పబడివున్నది. ఈ శిక్షణార్థులు పాటించవలసిన సూత్రాలుగూడ యీ గ్రంథాలలో వున్నాయి.

శిక్షణార్థి తనసాంకేతికవిద్య పూర్తిజేసినతర్వాత నిర్ణీతకాలంవరకు యజమానివద్దనేవుండి యజమానిచే పోషింపబడుతూ, తనసంపాదనను అతనికి ముట్టజెప్పవలెనని యాజ్ఞవల్క్యుడు సూత్రీకరించాడు[1]. 'అంతేవాసీ' యజమానివద్దవుండవలసిన శిక్షణకాలమునుగురించి మొదటే ఒప్పందము జరుగుతుండేదని మనము భావించవచ్చును. ఈ కాలము పూర్తిఅయ్యేవరకు శిక్షణార్థి ఆచార్యుని వద్దనేవుండి ఆయనకు సంపాదించి పెడుతుండాలి. తనకు శిక్షణవలన ప్రాప్తించిన యోగ్యతవలన యిట్టినిర్ణీతకాలములో సంపాదించినదంతా ఆచార్యునికే చెందగలదు. ఆచార్యుడు తనకిచ్చే అన్నవస్త్రాలు, నివాససౌకర్యమురన్న యీ సంపాదన యెంతో యెక్కువగావుండేది. అయితే అంతేవాసీ తనశిక్షణ ముగిసిన పిమ్మట ఆచార్యునికివ్వవలసినరుసుము గురించిగాని, వీరిద్దరి పరస్పర సంబంధములను గురించిగాని యాజ్ఞవల్క్యుడేమీ చెప్పలేదు. కాని తన ఆచార్యుడు శిక్షణవిషయములో అశ్రద్ధజూపినా, శిక్షణవిషయముతో ఎట్టిసంబంధమూలేని పనులుచేయించినా శైక్షణికుడు ఆయన్ను వదలి వెళ్ళిపోవచ్చును. వీరుచేసుకున్న ఒప్పందానికి స్వస్తిపలకడానికి యీ రెండుకారణాలు చాలును[2].

యాజ్ఞవల్క్యుని అభిప్రాయంతో దాదాపుగా ఏకీభవిస్తూ నారదుడు శైక్షణికుడు పాటించవలసినవిధులను చాలావిపులంగా వర్ణించాడు. కాబోయ్యే శిక్షణార్థి తన శిక్షణకొరకు ఆచార్యునివద్దకు వెళ్లేముందు తన కుటుంబముయొక్క అనుమతినిపొందాలి. తర్వాత ఆచార్యునివద్దకు వెళ్లి తనను అంతేవాసీగా గ్రహింపుమని ప్రార్థించాలి.ఆచార్యుడు నమ్మ

తించినట్లయితే వెంటనే యితని శిక్షణకాలమును నిర్ణయిస్తాడు. అప్పుడు అంతేవాసి శిక్షణపొందటానికి ఆచార్యునియింటివద్దనే వుండిపోతాడు[3]. ఆచార్యుడు తనకార్యస్థానమునకు యితడిని తీసుకువెళ్లి పనిచూపించి శిక్షణప్రారంభిస్తాడు. శిక్షణకాలములో ఆచార్యుడు శిక్షణార్థిని తన కుమారునివలె చూచుకొని తిండి, బట్ట యిచ్చిపోషించాలి[4]. శిక్షణార్థి కోరుకున్నదిగాక మరోవృత్తికిసంబంధించిన పనికి అతడిని నియోగింప రాదు. ఆచార్యుడు శిక్షణార్థిని తనస్వంతకొడుకువలె చూచుకోవాలన్న నారదుడు శిక్షణార్థి తన జీవితదర్శకుడైన ఆచార్యునిపట్ల విశ్వాసపాత్రముగానూ, గౌరవమర్యాదలతోనూ మెలగాలని ఆదేశించాడు. సత్శీల సంపన్నుడైన ఆచార్యుని నిరాదరముగాజూచిన శైక్షణికుని నేరస్థుడుగా భావించి శిక్షించాలని గూడ అన్నాడు[5].

తన శిక్షణ ముగిసినప్పటికి శిక్షణకాలము పూర్తి అయ్యేవరకు శైక్షణికుడు ఆచార్యునివద్దనేవుండి తననేర్పరితనముతో సంపాదించిన దంతా ఆచార్యునికి ఒప్పగించవలసినదేనని నారదుడు యాజ్ఞవల్క్యునితో ఏకీభవించాడు[6].

శిక్షణార్థి ఆచార్యునికి చెల్లించవలసిన రుసుము విషయములో నారదుడు శిక్షణకాలము ముగిసి తనుకోరినవిషయము నేర్చుకొన్న శిక్షణార్థి ఆచార్యునికి తనచిత్తమువచ్చినంతగా 'గురుదక్షిణ' యిచ్చి ఆచార్యునిశెలవుతీసుకుని స్వగృహానికివెళ్లాలని అన్నాడు[7]. అంటే యింతరుసుముచెల్లించాలని ముందుగా ఎట్టిఒప్పందము జరిగేదికాదు. ఈ పద్ధతిసాంప్రదాయంగా ఆచరించ బడుతున్నందువలన దీన్నిగురించి యాజ్ఞవల్క్య స్మృతిలో ప్రత్యేకంగా వుల్లేఖించ బడలేదనుకోవచ్చును. సాంకేతిక శిక్షణ వుచితంగానూ, సేవాధర్మంగానూ యివ్వబడేదను కోవడం పొరపాటుకాగలదు.

శిక్షణముగిసి శిక్షణకాలము పూర్తయినమీదట అంతేవాసి 'కర్మాకరు'డై తనవిద్యను స్వంతకర్మాగారములోగాని, మరొకరి పుద్యోగిగాగాని వినియోగించి ధనార్జనచేయవచ్చును. లేదా ఆచార్యుని కర్మాగారంలోనే పనిచేస్తూ తననైపుణ్యము దృష్ట్యా ఆచార్యుడు నిర్ణయించిన వేతనము పొందవచ్చును[8].

గేడ్స్‌గారి వాక్యాలలో "మధ్యయుగపు యూరోపులోవిశిక్షణ పద్ధతికి భారతదేశపద్ధతికి యెంతోసామ్యంవున్నది. యూరోపులో గూడ శైక్షణికుడు కొంతకాలము వేతనముపొందకుండానే విద్యానభ్యసిస్తూగడపాలిసి వుండెను. శిక్షణ పూర్తికాగానే సాంకేతికకార్మికుడుగావచ్చునుగాని తనయజమాని ప్రయోజనమునకు మాత్రమే పనిచేయగలడు. నిర్ణీతకాలము గడిచినపిమ్మట అతడు తన స్వంతవ్యాపకం ప్రారంభించుకోవచ్చును"[9].

ఈవిధంగా పరిశీలించినట్లయితే ప్రాచీనకాలములో మనదేశములో చేతిపనివారి శిక్షణకు తగుప్రాధాన్యత యివ్వబడేదని, అందుకు కావలసిన సౌకర్యములాకాలములో వుండేవని తెలుస్తున్నది. ఇంకో ముఖ్యవిషయమేమంటే శిక్షణార్థులను కార్మికులు[10]గానే భావించినప్పటికి వారు లేప్రాయములోనే యిల్లువదలి వెళ్లేవారుగాబట్టి ఆచార్యులు వారిని తమసంతానమువలె చూసుకోవటంద్వారా యీ పసివారికి తమ తలిదండ్రుల ప్రేమను అనుభవించలేకపోయామనే భావన రాకుండా చేయబడేది. శిక్షణ ముగియవచ్చేనాటికి వీరుయువకులుగా పెరిగి తమ భవిష్యత్తుకు కావలసిన వుచితనిర్ణయంతీసుకునే సమర్థులైవుండేవారు. ఆనాటి శిక్షణపద్ధతికి యీనాటిపద్ధతికి ముఖ్యమైనతేడా ఏమంటే ఆనాడు యజమానులపోషణలో వుండటమేగాక శిక్షణార్థులు తమశిక్షణముగిసిన మీద వారివద్దవుండటమో, విడిగా వృత్తి అవలంబించటమో ఎన్నుకునే

స్వేచ్ఛకలిగివుండేవారు కాగా యీనాడు శిక్షణకాలములో శైక్షణికులకు పోషణకై యేమీ లభించకపోగా శిక్షణముగిసినతర్వాత తప్పనిసరిగా అక్కడేపనిచేయవలసి వుంటున్నది. ఆచార్యునికి అంతేవాసికి అనాడున్నట్లుగా వ్యక్తిగత నికటసంబంధాలుండటానికి యీనాటి పరిశ్రమల పద్ధతిలో అవకాశమేలేదు.



# ఆరవ అధ్యాయము

## మహిళ, బాల కార్మికులు

ప్రాచీన భారతదేశములో మహిళలు ఎక్కువ భాగం గృహిణిలుగా యిల్లు దిద్దుకొనడంలో మునిగి వుండేవారు. కుటుంబానికి అన్నం వండిపెట్టడం, పొలముమీద పనిచేసే భర్తలకుచేదోడువాదోడుగా వుండటం వారి నిత్యకృత్యాలు. అయితే యితర రంగాలలో వారు ప్రాధానత మనేది నామమాత్రంగానే అని చెప్పటానికి వీలులేదు. వారు పరిశ్రమలలో కార్మికులుగానూ, యిండ్లలో దాసీలుగానూ పనిచేసేవారు. మన స్మృతులను, ధర్మగ్రంథాలను పరిశీలించగా మహిళలు ముఖ్యంగా (1) దాసీలు (గృహపరిచారికలు) గానూ, (2) గణికలుగానూ, (3) కర్మాకరులు (పారిశ్రామిక, వ్యాపసాయిక కార్మికులు) గానూ నియోగించబడేవారని బోధపడుతున్నది.

### దాసీలుగా మహిళలు

బానిసత్వమునుగురించి చర్చించే సందర్భములో ప్రాచీన దేశములో మహిళబానిసలుగూడ వుండేవారని తెలుసుకున్నాము. ఋగ్వేదములోని "అదాన్మేపౌరుకుత్స్యః పంచాశతంత్ర సదస్యుర్వధూనాం॥" (7-19-36) శ్లోకము, ఛందోగ్యోపనిషత్తులోని "ప్రవృత్తోఽశ్వతరీభ్యాం యుక్తో రథోఽశ్వతరీరథోదాసీనిష్కో దాసీభిర్యుక్తోనిష్కో హారోదాసీనిష్కః" (శంకర భాష్యము 5-13-2) శ్లోకము, తైత్తరేయ సంహితములోని "ఉదకుఖ్యానధినిధాయదాస్యోమార్జా లీయంపరినృత్యన్తిపదో నిఘ్నతీరదం మధుగాయంత్యో మధువైదేవానాం పరమమన్నాద్యమ్"

(7. 5. 10. 1) శ్లోకముల ద్వారా యిందుకు తగిన ఆధారాలు మనకు లభిస్తున్నాయి. ఇవిగాక అగ్ని పురాణములోగూడ యీ విషయమును గురించిన ప్రసక్తి వున్నది. బయటిదేశాలనుండి దిగుమతి చేయబడే మహిళబానిసలమీద, ఆయాదేశకాలాలనుబట్టి దిగుమతిసుంకము విధించ బడేదని అందులోవున్నది. పైగా వివిధ న్యాయవేత్తలచే బానిస వ్యవహారములను గురించి ప్రవేశపెట్టబడిన సూత్రాలద్వారా అప్పటిలో మహిళలను బానిసలుగానూ, దాసీలుగానూ నియోగించేవారని స్పష్టమవుతున్నది. నేలను వూడవటానికి, గిన్నెలుతోమటానికి, యజమానురాలికి సహాయపడటానికి, యజమాని ఆదేశాలను పాటించటానికి స్త్రీలు నియోగించబడేవారు.

సారాకేంద్రాలలో స్త్రీబానిసలను సారాయి అందించేవారుగా వుంచేవారు. త్రాగుబోతులనుండి వారికెట్టి అనుమానము కలుగకుండా అనేక రహస్యాలులాగే వేగురాండ్రుగా పనియిచ్చేవారు[1]. 'పురాతన సాహిత్య గ్రంథాలలో, ముఖ్యంగా నాటకాలలో, స్త్రీబానిసలను గురించి ప్రస్తావించబడివున్నది. కాళిదాసుని 'మాళవికాగ్ని మిత్రము'లో పరివ్రాజిత పాత్ర ఆ కాలములో వేగుస్త్రీలుండేవారని తెలుపుతున్నది. శూద్రకుని 'మృచ్ఛకటికము'లో మదనిక స్త్రీబానిసపాత్రగదా.

## గణికలుగా మహిళలు

ప్రాచీన భారతములో స్త్రీలు గణికలుగా పనిచేసేవారని శూద్రకుని 'మృచ్ఛకటికము', దండికవి 'దశకుమారచరితము'ల ద్వారా అవగతమవుతున్నది. ఆః గణికలు అందముగానూ, అత్యంతాకర్షణీయంగానూ, సరసంగానూ, ఉల్లాసంగానూ, చమత్కారంగానూ, సొగసుగానూ, నాజూకుగానూ వుండి వారివిటుకాళ్లను వుల్లాసపరచటమే పనిగా

పెట్టుకునేవారు. రాజదర్బారులలో నియోగించబడిన వారైతే రాజోప చారాలుచేయటం అనగా ఛత్రములు మోయటం, వీవనలు వీచటం, పరిమళము జల్లటం, ప్రభుపుపాదములను, శరీరమును మెత్తగాఒత్తటం శారీరకముగా వినియోగపడటం, దర్బారులలో అందరి మోద వినోదా లకు వుపహారిణులుగా వుండటం వీరి నిత్యకృత్యాలు[2]. తనచారిత్రికగ్రంధ మైన "ప్రాచీనభారతములో రాజ్యాము"లో డాక్టర్ బేణీప్రసాద్ హర్షుని కాలములో స్త్రీపరిచారికలను పెట్టుకునే ఆచారంపుండేదనీ, వారు ఛత్ర వాహకలుగానూ, అలంకారకులుగానూ నియోగింపబడే వారనీ వ్రాశాడు. గణికలు వృద్ధురాండ్రైనప్పుడు పంటెకత్తెలుగానూ, పడుచు పిల్లలను గణికలుగా తయారుచేసేందుకుగానూ నియోగించుకునేవారు[3]. ప్రజలు గూడ నిర్ణీతరుసుము చెల్లించి గణికలను తమవినోదార్థముపయోగించు కోవచ్చును. ప్రస్తుతము దక్షిణభారత దేవాలయాలలోవున్న దేవదాసీ పద్ధతి ప్రాచీనకాలములో విరివిగా వుండేది. ఉజ్జయినిలోని మహాకాళీ మందిరంలో దేవదాసీలుండేవారని కాళిదాసు "మేఘదూతము"లో పేర్కొన్నాడు. హ్యూయన్‌సాంగ్ మనదేశమువచ్చినప్పుడు కొన్ని సూర్యదేవాలయాలలోగూడ దేవదాసీలుండేవారు.

## పరిశ్రమలలో స్త్రీలు

కర్మకరులుగా పనిచేస్తూ స్త్రీలు పరిశ్రమలలో పాల్గొనేవారని కౌటి ల్యుని అర్థశాస్త్రముద్వారా తెలుస్తున్నది. స్త్రీలు పరిశ్రమలలో రంగులద్దే వారు (రాజాయిత్రులు)గానూ, కుట్టుపనివారు (పేసాస్కారులు)గానూ, బుట్టలల్లేవారు (బిడాలకారులు) గానూ, ముండ్లపనివారు (కంటకికి కారులు) గానూ నియోగించబడేవారని నేటి ప్రముఖ చరిత్రకారులలో ఒకరైన డాక్టర్ రాధాకుముద ముఖర్జీ వ్రాసియున్నారు[4]. ఇదిగాక ప్రభుత్వ నూలు, నేత కర్మాగారాలలోనూ, తమయిండ్లలోనూ నేత

నాలకై పనిచేసేవారు. సాధారణంగా వృద్ధురాండ్రయిన వితంతువులు, సాధుస్త్రీలు, వయస్సుమళ్లిన గణికలు, దేవదాసీలు, శీలహీనులు, అనాథ యువతులు ప్రభుత్వ కార్ఖానాలలో పత్తి, జనుము నుండి నూలువడక టానికి నియోగించబడేవారు[5]. పరదాస్త్రీలనుగూడా యీవిధంగా నియోగించేవారు. తమపోషకులు విదేశాలలోవున్న పరదాస్త్రీలు, విధవరాండ్రు అనాథ బాలికలుమొదలయినవారు కష్టించి పొట్టబోసుకోదలిస్తే జీతాల మీద వారిని నియోగించవచ్చునని అర్థశాస్త్రములో ప్రత్యేకముగా పేర్కొనబడివున్నది[6].

ఇవిగాక స్త్రీలను సారాయివడపట్టే పనికి పెట్టుకునేవారు[7]. అయితే వీరంతా బానిసలుగా గాక వేతనాలకు పనిచేసే కార్మికులేనవి అధికారికంగా చెప్పవచ్చును.

## మహిళకార్మికుల వేతనాలు

ఏ దేశంలోనైనా కార్మికశాస్త్రమునకు సంబంధించిన పెద్దసమస్య కార్మికులవేతనాలకు సంబంధించి వుంటుంది. ప్రాచీన భారతములో స్త్రీకార్మికులవేతనాల సమస్య పరిశీలించినట్లయితే మనకు కొన్ని విషయాలు తెలుస్తున్నాయి. స్త్రీ పురుష కార్మికుల వేతనరేట్లలోబేధాలున్నట్లు చెప్పటానికి ఎట్టి ఆధారములేదు. ఇరువురివేతనాల నిర్ణయానికి సంబంధించి ఒకే విధమైన సూత్రాలు పాటించబడినాయి.

స్త్రీలవేతనాలు కార్యమానంగాను, కాలమానంగాను యివ్వబడవచ్చును. పనిరేటుగా అయితే చేసినపనియొక్క నాణ్యానికి ప్రాముఖ్యత యివ్వబడేది. స్త్రీలు పడికిననూలు నాణ్యమునుబట్టి పరిమాణమును బట్టి వేతనాలు నిర్ణయించవలసిన బాధ్యత సూత్రాధ్యక్షునిమీద వుండేది[8]. తమయింటివద్దవడికిన నూలును ఉదయం కర్మాగారానికి తెచ్చియిచ్చే

స్త్రీలకు వెంటనే జీతము(మజ్దూరి)యిచ్చివేయాలని కౌటిల్యుని ఆదేశము[9]. అయితే పనిపూర్తి చేస్తేనేగాని ఏకార్మికునికి (స్త్రీగాని, పురుషుడుగాని) జీతమిచ్చేదిలేదు. కర్మాగారములో హాజరుగావున్నంతమాత్రానే జీతానికి ఎవ్వరూ అర్హులుగాజాలరు. పని అసంపూర్ణంగాజరిగినా, అందులో దుబారా జరిగినా జీతము నుండి పట్టుకోబడుతుంది[10]. శెలవు దినాలలో అధికంగా జీతమిచ్చి పనితీసుకోటానికి కౌటిల్యుడు యిష్టపడిన విషయం విశదముగా వున్నది.

గణికలుగా నియోగించబడిన స్త్రీలకు వారి సౌందర్యము, అవయవసొంపులనుబట్టి వేతననిర్ణయంజరిగేది[11]. కూలికివచ్చిన కార్మికులు గాకపోవటంవలన స్త్రీబానిసలకు జీతమంటూ ఏమీయివ్వబడేదిగాదు.

## పని నిబంధనలు

చాలావరకు స్త్రీలు.తమపనిని యింటివద్దనేవుండి చేసుకునే అవకాశంకలిగి వున్నందువలన వారికి అన్నిగృహ సదుపాయాలూవుండేవి. వారు యింటిపనులు చూసుకోవచ్చును. ఎన్నిసార్లయినా విరామము తీసుకోవచ్చును. అయితే నిర్ణీతమయిన కనీసపుపనిచేసి యివ్వకపోతే జీతములో మినహాయింపుకు గురికావలసి వస్తుంది. కాబట్టి కౌటిల్యునికాలములో యింటివద్దవుండి పనిచేసుకునే అవకాశముపొందిన స్త్రీలపని హాయిగావుండేదని చెప్పవచ్చును. కర్మాగారాలలో పనిచేసే స్త్రీలకు గూడ వుద్యోగ సౌకర్యములు అనుకూలంగానే వుండాలి. వారిపట్లచూపబడే దాక్షిణ్య, గౌరవభావములే యిందుకునిదర్శనముగా చెప్పవచ్చును. కౌటిల్యుని అర్థశాస్త్రముగాక యితర గ్రంథాలలో స్త్రీ కార్మికుల ఉద్యోగ నిబంధనలు గురించి ఎట్టిసమాచారము లభ్యముగాలేదు.

కౌటిల్యుడు విధించిన అనేక నియమాలవలన స్త్రీకార్మికులమాన భంగముగాకుండా కట్టుదిట్టము యేర్పడింది. ఉదాహరణకు, పనిచేస్తున్న స్త్రీముఖముచూసినా, ఆమెతోసంభాషించినా, నేరముగా భావించబడి ప్రథమశ్రేణి శిక్షవిధించబడేది[12] . ఆమెకు వేతనము పంచియిచ్చే సమయములో ఆటంకములు కలుగజేసినవారికి రెండోశ్రేణిశిక్ష విధించబడేది[13] . కార్మికమహిళలతో అశ్లీలమైన సాంగత్యం పొసగకుండా కట్టుబాట్లుచేయాలనే వుద్దేశ్యంతో పనిచేయనిస్త్రీకి ఆమెనుండి లంచము తీసుకునిగాని మరేకారణము వలనగాని వేతనముచెల్లించినవారు మధ్యమశ్రేణి శిక్షపొందగలరని కౌటిల్యుడు విధించాడు. కన్యలమానభంగము చేయటానికి ప్రయత్నించటం, స్త్రీలరూపభ్రష్టము చేయటానికి ప్రయత్నించటం ఘోరమైన నేరాలుగా పేర్కొనబడ్డాయి[14] . కౌటిల్యుని కాలములో స్త్రీబానిసలకుగూడ యిట్టి సంరక్షణలుండేవని యీ సందర్భములో మరచిపోరాదు.

## బాలింత సదుపాయాలు

గర్భిణులైన స్త్రీకార్మికులకు, స్త్రీబానిసలకు తగుసంరక్షణ కల్పించబడింది. వారినితొలగించటం, అమ్మటం, కొనటం, దానమివ్వడం నిషేధించబడింది. గర్భిణులను దూరము చేయాలనుకుంటే యజమానులు వారి ప్రసవానికి అన్నియేర్పాట్లు చేసితీరాలి. ఇందులో యేలోపము జరిగినా కఠినశిక్షకు పాత్రులవుతారని శాసించబడింది[15] .

## పనిచేయనందుకు శిక్ష

స్త్రీ కార్మికులకు యిన్నివిధముల సదుపాయాలు కలిగించినప్పుడు వారిపై కొన్ని బాధ్యతలుగూడ వుంచబడినవి. ఉదాహరణకు వారికిచ్చిన

పనిని పూర్తిచేసి యివ్వాలనే నిర్బంధము వారికి వుండేది. స్త్రీ కార్మికు లకు జీతాల హామీ యిచ్చి అది పాటించని యజమానులకు శిక్ష విధించి నట్లే జీతము తీసుకుని పని ఎగవేసేవారు గూడా శిక్షించబడాలని కౌటి ల్యుడు శాసించాడు. తన భత్యము పుచ్చుకున్న గణిక తన విధి నిర్వ హణ చేయకపోతే అట్టి భత్యమునకు రెట్టింపు మూల్యము చెల్లించవలసి వుంటుంది.[16] కార్మిక స్త్రీ జీతము పుచ్చుకుని తనకు యిచ్చిన పని చేయటానికి నిరాకరించితే ఆమె బొటనవేలు తెగవేయాలన్నాడు. దొంగ తనము, విశ్వాస ఘాతుకము చేసిన స్త్రీ కార్మికులకు గూడ యిటువంటి కఠిన శిక్ష పడేది.[17]

మొత్తముమీద ప్రాచీన భారతదేశములో కార్మిక మహిళల వుద్యోగ నిబంధనలు, వేతనాలు అసంతృప్తికరంగా గాని, అన్యాయంగా గాని లేవని తీర్మానించవచ్చును.

## బాల కార్మికులు

జీతాలమీద పిల్లలు పనిలో పెట్టుకోబడుతుండేవారనటానికి తగిన సాక్ష్యం లేదుగాని బాలబానిసలుండేవారు గాబట్టి ఏదో రూపంలో బాల కార్మికులుండేవారనే చెప్పాలి. ఎనిమిది సంవత్సరాలకు లోబడివున్న పసికందులను క్షుద్రకార్యాలు చేయించటానికి బానిసలుగా వుంచుకునేవారు. యజమానులు దయతలచి విముక్తి కలిగిస్తే తప్ప బానిసల బిడ్డలు బాని సలుగా పుట్టి, బానిసలుగా బ్రతికి, బానిసలుగా మరణించేవారు. ప్రాచీన శాస్త్రకారులలో ఒక్క కౌటిల్యుడు తప్పించి మరెవ్వరుగూడ యిట్టి అమానుషమైన ఆచారాన్ని గురించి పట్టించుకోనూలేదు. దాన్ని రూపు మాపే ప్రయత్నమూ చేయలేదు. బాలబానిసలను బజారులో సరకులవలె అమ్మటం, కొనటం జరిగేది. బానిస వ్యవస్థను గురించి చర్చించిన

సందర్భములో కౌటిల్యుడు కిరాతకులు, వెనుకబడినవారు అయిన మ్లేచ్ఛులు తప్ప ఆర్యుల సంతానమైన పిల్లలను బానిసలుగా వుంచు కోవటం నిషేధించాడని తెలుపబడింది.[18] బానిసగాని ఆర్యునికి పుట్టిన పిల్లలను అమ్మినా, కొన్నా, తాకట్టు పెట్టినా, యీ బేరానికి సంబంధించిన యిరుపక్షాలవారికి, సాక్షులకు శిక్షయిచ్చేవారు. వారి సామాజిక అంతస్థులను బట్టి వారికి శిక్ష విధించబడేది.[19]

బానిసల బిడ్డలు ఆర్యుల బిడ్డలవంటి వారేనని, బానిసలవలె క్షుద్ర కార్యాలు చేసే శరీర పటిష్టత వారికి వుండదని, ఎనిమిదేండ్లకు తక్కువ ప్రాయముగల పిల్లలను అమ్మటానికి, కొనటానికి అనుమతించడం పైశాచికము కాగలదని కౌటిల్యుడు గ్రహించటమువల్లనే అట్టి బేరాలు నిషేధించివేశాడు.[20] తనకుపూర్వము విరివిగా బాలబాలకులపై జరిగే యిట్టి దౌర్జన్యాలను అరికట్టటానికి కౌటిల్యుడీ విధంగా పూనుకున్నాడు. ఆయ నయితే బానిస బిడ్డలచేత క్షుద్రపు పనులు చేయించటము నిషేధించాడు గానీ అంతమాత్రాన వారిపట్ల జూపబడే ఆదరణ ఆదర్శప్రాయంగా వుండేదని చెప్పజాలము. ఎందుకంటే వారికి స్వేచ్ఛా, యితరులతో సమానమైన అవకాశాలూ వుండేవిగావు.



# ఏడవ అధ్యాయము

## పారిశ్రామిక సంబంధాల నియంత్రణ

---

కార్మికుల జీతభత్యాలు, ఉద్యోగ నిబంధనలు చర్చించిన తర్వాత ప్రాచీనకాలములో పారిశ్రామిక యజమానులకు కార్మికులకు మధ్య సంబంధాలెట్లా వుండేవో తెలుసుకొనడం వుచితంగా తోస్తుంది. అప్ప టిలో కంట్రాక్టరు, వణిజులు, చేతిపనివారు, వ్యాపార సంస్థలు మొదల యినవారికి వారు పెట్టుకొనే అనిర్ణీతపు పనివారలకు, ఉత్పత్తి కార్మికు లకు మధ్య ఎట్టి సంబంధాలుండేవో ఆలోచించవలసి వుంటుంది. వీరిరు వురికి మధ్య శాంతియుత సంబంధాలుండాలని కొన్ని సూత్రాలు చేయ బడ్డాయి. ఈ సూత్రాలకరుకుదనాన్నిబట్టి ఆకాలంలో సత్సంబంధాలుం డేవి కావని యీ సూత్రాలద్వారా సత్సంబంధాలను బలవంతంగా నెల కొల్పే ప్రయత్నం జరిగేదని స్ఫురిస్తున్నది. చాలామట్టుకు పని చేయ నందువల్లనో, నిర్లక్ష్యంగా చేసినందువల్లనో, చేసిన పనికి జీతము చెల్లించకపోవటంవల్లనో యిద్దరిమధ్య తగాదాలు బయలుదేరేవి. కొన్ని సార్లు కార్మికులు అహంభావముతోనూ, దురాలోచనతోనూ పనిచేయటం మానివేసి యజమానులను నష్టపరిచేవారు. ఇటువంటి యిబ్బందులను అరికట్టేందుకని న్యాయవేత్తలు కార్మికులను కట్టుబాట్లలో వుంచగల సూత్రాలను కనిపెట్టేవారు.

### పనిచేయనందుకు శిక్ష

పనిచేసినందుకు జీతము యిప్పించే పూచీతీసుకుని ప్రభుత్వము కార్మికులను తెలివితేటలతోనూ, విశ్వాసపాత్రంగానూ, ఒళ్లు దాచుకో

కుండానూ పనిచేయాలనే బంధముతో కట్టివేసింది. పనిచేయని కార్మికులకు అపరాధం విధించటం, కారాగార శిక్ష విధించటం జరిగేది. జీతము ముందుగా పుచ్చుకుని పనిచేయ నిరాకరించటం, పని పూర్తిగా చేయక పోవటం, పనివదిలి వెళ్ళిపోవటం గొప్పనేరాలుగా భావించబడేవి. ఇట్టి శ్రమశిక్షణారాహిత్యాన్ని ప్రభుత్వము సహించదని స్పష్టం చేసింది. ప్రస్తుతకాలంలో ప్రభుత్వాలు ఉపద్రవ పరిస్థితులలో ఉత్పత్తి నిరోధాన్ని సహించనట్లే అప్పటి ప్రభుత్వాలుగూడ నడుచుకునేవి. అప్పటి న్యాయవేత్తలందరికందరూ యీ సమస్యను పేర్కొన్నారు.

కౌటిల్యుని అర్థశాస్త్రమే తీసుకుని చూద్దాం. జీతము పుచ్చుకున్న కార్మికుడు పనిచేయ నిరాకరించినట్లయితే 12 పణముల అపరాధం విధింపబడుతుందని ఆయన యేర్పరచాడు.[1] తన పోషణతోసహా నెలకు ఒకటి ఒకటిన్నర పణములు సంపాదించుకునే కార్మికులకు 12 పణముల అపరాధం అంటే చాలా ఎక్కువ. అందుకే కార్మికులకు పని ఎగవేసే ఆలోచన కూడ వచ్చేదికాదని చెప్పవచ్చును.

మనువు గూడ కౌటిల్యుని దారిలోనే నడిచాడు. అహంభావముతో గాని, అనారోగ్యము తప్ప యేయితర కారణాలవలనగాని అనుకున్న పని చేయని కార్మికునికి అతని జీతం నష్టపడడమేగాక ఎనిమిది గుంజల అపరాధం విధించాలని ఆయన ఆజ్ఞ. యజమానినుండి తీసుకుని అతనితో ఒప్పందము చేసుకున్నట్లుగా పనిచేయని కార్మికుని నుండి అతని జీతానికి రెండింతలు వసూలు చేయాలనీ, యజమాని అవతలికి పోగానే నెత్తిమీది బరువు దించేసి కూర్చునే కార్మికుని జీతంలో ఏదోపంతు కోయాలనీ యాజ్ఞవల్క్యుని ఆదేశము. సగం పనిచేసి మానివేసినట్లయితే నాలుగోవంతు జీతము — ఒక్కొక్కప్పుడు పూర్తిజీతము పట్టుకోవచ్చును.[4]

విష్ణుస్మృతి వ్రాయబడిన తర్వాత యీ నియమాలు మరింత కఠినంగా వుండేవనిపిస్తుంది. విష్ణుని ఆజ్ఞ ప్రకారమైతే నిర్ణీతకాలానికి ముందుగా పనివదిలి వెళ్ళిన కార్మికుడు తన జీతము మొత్తము యజమానికి యిచ్చివేయటమేగాక రాజుగారికి విడిగా నూరు పణములు చెల్లించుకోవలసివుంటుంది[5] జీవనోపాధి కష్టంగా లభించే మీపకార్మికులకు యిది చాల కఠోరమైన శిక్ష అని చెప్పకతప్పదు.

కార్మికులచేత పని చేయించటానికి నారదుడు క్రొత్త పద్ధతిని కనిపెట్టెను. తాను చేస్తానని ఒప్పుకున్నపని చేయనట్టి కార్మికునికి జీతము ముందుగానే యిచ్చి అప్పటికీ పనిచేయకపోతే యిచ్చిన జీతానికి రెట్టింపు సొమ్ము అపరాధం క్రింద వసూలు చేయాలి.[6] కార్మికులకు పని చేయకపోతే గత్యంతరము లేదని దీనివలన తెలుస్తున్నది.

బృహస్పతి యీ విషయములో మిగతా అందరు న్యాయవేత్తలను అధిగమించి వెళ్ళాడు. తాను ఒప్పుకున్న పనిలో ఏకాంత భాగము చేయకుండా వదలినా అతని మొత్తము జీతమంతా పట్టుకోవటమేగాక పనిచేయని నేరానికి న్యాయస్థానములో ఫిర్యాదు చేయవచ్చును.[7] పని చేస్తానని జీతము తీసుకున్న తర్వాత చేయగలిగిన స్థితిలోవుండి పని చేయ నిరాకరించినట్లయితే ఆ తీసుకున్న జీతము బలవంతముగానైనా సరే యజమానికి యిప్పించటమేగాక అందుకు రెట్టింపు ధనము రాజుగారికి అపరాధం చెల్లింపజేయాలి. లేకపోతే అతనిపై శారీరకముగా ఒత్తిడిచేసి పనిచేసేటట్లు చేయవచ్చును. అప్పటికీ మొండితనము చూపించినట్లయితే అందుకు శిక్షగా అతని జీతము మొత్తము పట్టుకోవటమేగాక ఎనిమిది 'కృష్ణలములు' అపరాధము విధించాలి.[8]

## అజాగ్రత్తగా పనిచేసినందుకు శిక్ష

కార్మికులు పనిచేయ నిరాకరించినందుకేగాక అజాగ్రత్తగా పని చేసినందుకు గూడ పూచీపడవలసి వస్తుందని ప్రభుత్వాలు శాసించాయి. వారి యిష్టానికి వ్యతిరేకంగా కార్మికులు పనిచేయాలని బలవంతపెడితే వారు బాధ్యతారహితంగానూ, నిర్లక్ష్యంగానూ పనిచేసి నష్టము కలుగ జేయగలరని తెలిసినవారై అప్పటి న్యాయవేత్తలు కార్మికులు తాము చేసే పనిలో అతిజాగరూకులుగా వుండాలని అనేక సూత్రాలు ప్రవేశపెట్టారు. అజాగ్రతకు శిక్షగా వారి జీతాలు పట్టుకోబడడమే గాకుండా అందువలన కలిగిన నష్టాన్ని వారే భరించడము, పైపెచ్చు రాజుగారికి కొంత అప రాధము చెల్లించుకోవడము తప్పవిగావు. ఇట్టి నేరాలకు ఎటువంటి శిక్షలు విధించేవారో తెలుసుకోవడము మనకు ముఖ్యం.

తన కివ్వబడిన పని చేయకపోయినా, అజాగ్రత్తగా చేసినా అట్టి కార్మికుని యొక్క వారము జీతము పట్టుకుని ఆపని యితరుల చేత చేయించుకోవచ్చునని కౌటిల్యుడు తన 'అర్థశాస్త్రము'లో వ్రాశాడు.[9] కార్మికుడు ఏవస్తువు పగలకొట్టరాదు, యజమాని అనుమతి లేకుండా వెంటతీసుకుపోరాదు. ఈ సూత్రాన్ని వుల్లంఘించిన వారికి 24 పణముల అపరాధం విధించబడేది.[10] ఈ విధంగానే యాజ్ఞవల్క్యుడు కూడ కార్మి కుడు తాను మోసుకుపోవలసిన బిందెను కావాలని పగలకొట్టినా, లేక అది పగలకుండా వుండటానికి తన శక్తిని వుపయోగించకపోయినా అట్టి నష్టానికి పరిహారం చెల్లించవలసి వుంటుందని ఆదేశించాడు. అట్టి వస్తువులను ఒకచోటినుండి మరొక చోటకి చేరవేసేటప్పుడు ఆటంక పరచినవాని నుండి అతని జీతానికి రెట్టింపు మూల్యము వసూలు చెయ్యాలి.[11] కావాలని నష్టము చేకూర్చిన కార్మికుని గురించి యాజ్ఞ వల్క్యుడింత పట్టుదలజూపాడు. విష్ణువు,[12] నారదుడు[13] గూడా యిటు

వంటి అభిప్రాయాలనే ప్రకటించారు. వీటిని పరిశీలించినట్లయితే అజాగ్రతగా పనిచేసిన కార్మికుల జీతాలు పట్టుకోవడమేగాక వారు అందువలన కలిగిన నష్టానికి పరిహారము చెల్లించుకోవాలి. పైపెచ్చు రాజుగారికి కొంత అపరాధం కట్టాలి అని బోధపడుతున్నది. నిర్లక్ష్యము బాధ్యతారాహిత్యము జూపేవారికి నిజంగా యివి పెద్ద ప్రతిబంధకాలే.

## జీతాలివ్వని యజమానుల నుండి కార్మికులకు రక్షణ

కార్మికుల చుట్టూ నియమాలున్నట్లుగానే వారి రక్షణ నిమిత్తం గూడ అనేక చట్టాలు చేయబడ్డాయి. పని చేయించుకుని జీతాలివ్వని యజమానులకు, అనవసరంగా ఉద్యోగము నుండి కార్మికులను తొలగించే యజమానులకు శిక్షపడుతుండేది. కొన్ని నిర్ణీత నియమాల ప్రకారం తప్ప మామూలుగా యజమానులు కార్మికులకు సక్రమంగా జీతాలివ్వటము తప్పనిసరిగా వుండేది. కార్మికులకు జీతాలిచ్చే విషయములో అవకతవకలు చేసిన యజమానులకు కౌటిల్యునిచే అట్టి జీతములో పదో వంతుగాని ఆరు పణములుగాని అపరాధం విధించబడేది.[14] యాజ్ఞవల్క్యుడు యిటువంటి యజమానులకు ఎట్టి శిక్షలు విధించలేదుగాని కార్మికులకు జీతాలిప్పించటానికి తగిన యేర్పాట్లు చేశాడు. బహుశః తదుపరి పరిస్థితులు బాగా దిగజారిపోయి వుండటమువల్లనే విష్ణువు తప్పుగా ప్రవర్తించిన యజమానులను కఠినంగా శిక్షించాలని ఆదేశించాడు. విష్ణుస్మృతిలో యిట్టి నిబంధనలనేకమున్నాయి. ఉదాహరణకు నిర్ణీత కాలానికి ముందుగా ఏ యజమాని తన కార్మికులను ఉద్యోగ విముక్తులను చేయరాదు. ఒకవేళ నియవలసివస్తే అతనికి పూర్తి ఉద్యోగ కాలమంతటికి జీతము కట్టియివ్వాలి. బుద్ధి పూర్వకంగా నియమోల్లంఘన చేసిన యజమానులు కార్మికులకు పూర్తిజీతము చెల్లించవలసి వుండటమేగాక రాజుగారికి నూరు పణముల అపరాధం యిచ్చుకోవాలి.[15]

కార్మికుని చేత పని చేయించుకున్న యజమాని అతనికి జీతమివ్వ కపోయినట్లయితే రాజుగారు జోక్యం చేసుకుని అనుకున్న ప్రకారంగా అతనికి జీతము యిప్పించటమేగాక అందుకు సమానమైన మూల్యము పిసిగా ఆ యజమాని నుండి వసూలు చేయాలని బృహస్పతి అభి ప్రాయపు.16

కాబట్టి సమయానికి జీతమివ్వని యజమానులు శిక్షార్హులేనని తేలు తున్నది. అంతేగాక జీతమునుండి చట్టసమ్మతముగానట్టి ఏ కత్తి రింపులు చేయవీలులేదనీ, జీతాలు పట్టుకోవడం పనికిరాదనీ గూడ స్పష్టపడుతున్నది కఠినశిక్షకు గురిచేయడంద్వారా నియమోల్లంఘనను వారించి ఇరుపక్షాలు శాంతియుతంగానూ, తగాదాలు లేకుండానూ మెలగేటట్లు యేర్పాటు చేయబడింది. ఇటువంటి పద్ధతులే వర్తమాన కాలములోగూడా అమలులో వున్నాయి. జీత మివ్వకపోవటము. ఆలస్యంగా యివ్వటము, అనధికారికంగా జీతములో కోతలు పెట్టడం మొదలయినవి యిప్పుడుగూడ శిక్షార్హమైన చర్యలే. కార్మికుని పనిలో నుంచి తొలగించాలంటే తగినంత ముందు సూచన యివ్వటమో లేక అందుకు బదులుగా సాధారణంగా ఒక నెల జీతము యివ్వటమో తప్పనిసరిగా వుంటున్నది. అప్పటికీ యిప్పటికీ తేడా ఏమంటే వర్త మానకాలంలో ప్రభుత్వాలు కార్మికులకు, వారి సంస్థలకు ఎక్కువ మొగ్గు చూపుతుండగా ప్రాచీన కాలములో పరిస్థితి యిందుకు వ్యతిరేకంగా వుండేది.

## కార్మికోద్యమము

సాముదాయిక బేరసారాలు, సామూహిక చర్యలవంటి కార్మి కోద్యమ పద్ధతులు వెనకటి కాలంలో లేకపోలేదు. ఈ విషయము

గురించి కౌటిల్యుడు తన అర్థశాస్త్రములో ప్రస్తావించి యున్నాడు.[17] ప్రాచీన కాలంలో కార్మికులు తమ యజమానులతో సామూహికంగా బేరమాడి తమ వేతనాలు నిర్ణయం చేసుకునేవారని తెలుస్తున్నది. సాముదాయికంగా బేరమాడటం చట్ట వ్యతిరేకముగాదు గాని యజమానిని నష్టపరిచే ఉద్దేశ్యంతో కార్మికులు సామూహిక చర్యలకు పూనుకొనడం చట్టము దృష్టిలో శిక్షార్హమైన నేరమే.[18] అయితే కార్మికుడు వ్యక్తిగతంగా పూనుకునే చర్యలతో పోల్చితే కార్మికుల సామూహిక చర్యలు తక్కువ నేరాలుగా భావించబడేవి.

## పారిశ్రామిక శాంతి నెలకొల్పే పద్ధతులు

యజమానులకు కార్మికులకు మధ్య సద్భాంధవ్యాలుండవలసిన ఔచిత్యాన్ని ప్రాముఖ్యతను వేదకాలంలోనే గుర్తించబడినవనటానికి యజుర్వేదములో సాక్ష్యమున్నది.[19] ఇదిగాక యితర ప్రాచీన న్యాయ శాస్త్ర గ్రంథాలలో యీ విషయాన్ని ధృవపరిచే శ్లోకాలు అనేకము మనకు లభిస్తాయి. ఈ సత్సంబంధాలు నిలిచి వుండడానికై అవలంబించవలసిన కొన్ని పద్ధతులను గురించి, తగాదాలు తీర్చుకునే పద్ధతి గురించి యీ గ్రంథాలలో వ్రాయబడివున్నది. యజమానులకు కార్మికులకు మధ్యవచ్చిన తగాదాలు అందుకు సంబంధించిన పత్రాలు, సాక్ష్యాలు ఆధారంగా చేసుకుని పరిష్కరించుకోవాలని తీర్మానించబడింది.[20]

ప్రభువులు, న్యాయస్థానాలు గాక యిట్టి తగాదాలను మధ్యవర్తులు గూడ తీర్చేవారు. 'మధ్యవర్తుల' నీ, 'వేతన సంఘాల' నీ నిర్దుష్టమైన పదాలు మనకు తగలకపోయినా అర్థశాస్త్రములో కొన్ని పంక్తులు వీటి భావాన్నే స్ఫురింపజేస్తున్నాయి. ఉదాహరణకు అర్థశాస్త్రములో ఒకానొక సందర్భములో చేతిపనివారు, వైద్యులు, న్యాయవేత్తలు, ఉద్యో

గులు మొదలైనవారి జీతభత్యాలు యితర ప్రాంతాలలో వున్నట్లుగానో 'నిపుణులు' నిర్ణయించినట్లుగానో చెల్లించాలని వ్రాయబడింది.[21] ఇందులో 'నిపుణులు' అనేపదము యోగ్యులైన మధ్యవర్తులనో, మధ్య వర్తుల సమితినో సూచిస్తున్నది. వర్తమానకాలపు వేతన నిర్ణాయక సంఘాలకు వీటికి ఎంతో సామ్యం వున్నది

నిపుణులు యిదమిత్థంగా ఒక నిర్ణయానికి రాలేకపోయినట్లయితే ప్రభువులు తమ నిర్ణయాలు తెలుపజేసి తగాదాలు తీర్చేవారు. నిపుణుల ద్వారానూ న్యాయస్థానాలద్వారా పరిష్కారముగాని తగాదాలలో ప్రభు వులు వాటికి సంబంధించి లభ్యమైన సాక్ష్యాలు, లిఖితపత్రాలు ఆధారంగా జేసుకుని తమ తీర్పు యిచ్చేవారు. దీర్ఘకాలంగా అపరిష్కృతంగావున్న సమస్యలవిషయములో ప్రభుత్వము కల్పించుకోవచ్చుననే వాదానికి యిది యెంతో బలము చేకూరుస్తున్నది. రాజులు, న్యాయస్థానాలు అందరికీ న్యాయం కలుగజేసేవారని చెప్పాలి. ఎందుకంటే వారికి న్యాయము యొక్క ఆధిక్యతనుగూర్చి మనువుచెప్పిన మాటలలో ప్రబల విశ్వాసం వుండేది.[22] న్యాయస్థాపనకోసం శారీరకబలం వుపయోగించబడేది. పనివదలివెళ్ళిన కార్మికుడిని, పశువులను ఎదలివెళ్లిన గోపాలకుడిని బెత్తాలతో కొట్టాలని ఆపస్తంభ ధర్మసూత్రములో పేర్కొనబడి వున్నది.[23] బృహస్పతి దీనికి కొంచెము భిన్నాభిప్రాయం ప్రక టించాడు.[24]

బలప్రయోగంద్వారా యజమానులకు కార్మికులకు మధ్య శాంతి పూర్వక సంబంధాలను నెలకొల్పే ప్రయత్నాలు ఆ కాలంలో జరిగేవని స్పష్టమవుతున్నది. మానవత్వ విలువలకు ఎక్కువ ప్రాధాన్యం యివ్వబడేది కాదు. ఒప్పందాలను అమలుపరిచే విషయములోనైతే

ప్రాచీనకారులు తగిన కట్టుబాట్లు చేశారుగాని వాటి వుల్లంఘన యెందు వలన జరిగేదో ఆ కారణాలపై వుకు ఎవ్వరూ దృష్టి పోనివ్వలేదు.

కాని మనువు మానవప్రవర్తనమీద నీతి, ఆదర్శాల ప్రభావాన్ని బాగా గుర్తించాడు.[25] ఒకపని చేయటానికి ప్రోత్సాహం కలిగించేవి మనస్సు, మాట, శరీరము అనీ, వీటి ఫలంగానే ఫలితాలు—మంచివి, చెడ్డవి—కలుగుతుంటాయనీ, అన్నింటికిమించి శరీరముచేత గూడ పని చేయించేది మనస్సేనని గ్రహించాడన్నమాట. అయితే యీ తత్వాన్ని మనువు పారిశ్రామిక సంబంధాల విషయంలో ప్రవేశపెట్టలేదు. ఆనాడు బహుశః పారిశ్రామిక సంబంధాల సమస్యలసేవి అంత తీవ్రంగా వుండకపోవటమే యిందుకు కారణమై వుండవచ్చును.

కొన్ని శతాబ్దాల తర్వాత శుక్రుడు యీ చిక్కును సరిగ్గా అర్థం చేసుకోవడమేగాక యీ జటిలసమస్యను పరిష్కరించ ప్రయత్నించి సఫలీకృతుడైనాడు. తాత్వికంగా మనస్సుకు సంతృప్తి లేకపోవడము వలన వుద్భవించిన మనోవికారమే యీ పరిస్థితికి మూలాధారమని నిర్ణయించాడు. అందుచేతనే కష్టించి పనిచేసేవానికి కడుపునిండా తింపి లభించేటంతగా జీతము యేర్పాటు చేయాలని వాదించాడు.[26] కేవలం ప్రాణము నిలుపుకునేటంత వరకే సరిపోయేట్టుగా జీత మిచ్చి నట్లయితే కార్మికుడు నిరుత్సాహపడి యజమానికి నష్టం కలిగించే భావాలకు చోటు యిస్తాడు. కాబట్టి యజమానుల స్వార్థం దృష్టిలో పెట్టుకుని చూసినా కార్మికులకు హెచ్చు జీతాలిచ్చి వారిని తృప్తిపరిచి వారి మనోవికారాలకు మూలములేకుండా చేయాలి. మనస్సులో అశాంతి ప్రవేశించిందంటే ఎప్పుడో ఒకప్పుడు అది బద్దలై బయటికి రాక మానదు. అప్పుడు దాన్ని బలప్రయోగంతో అణచటం సాధ్యపడదు. అందుకని వారికి న్యాయసమ్మతమైన జీతాలిచ్చి, కరుణాత్మకంగా వారి

పట్ల ప్రవర్తించి వారిలో అశాంతి ప్రవేశించకుండా చూడటమే వుత్తమ మార్గము.

యజమాని ఒక్కొక్కప్పుడు కఠినంగానూ, అసహ్యంగానూ మాట్లాడి, శిక్షించి పనివాండ్ల విరోధాన్ని కొనితెచ్చుకుంటాడు.[27] కార్మికుని వ్యక్తిత్వానికి సంబంధించిగూడ కొన్ని తగాదాలు బయలు దేరుతాయని శుక్రాచార్యుడు కనిపెట్టాడు. ఎంత తక్కువ అంతస్థులో వున్నపనివాడైనా తన వ్యక్తిత్వానికి తగిన విలువ యివ్వబడక పోవటాన్ని, నీచంగా చూడబడటాన్ని సహించడు. అట్లా చూసినవారిని తనశత్రువుగా భావిస్తాడు. అందుకనే కార్మికులను హీనంగా చూడడం, వారిపట్ల అన్యాయంగా ప్రవర్తించడం కూడదని యజమానులను సముచితంగా హెచ్చరించాడు. కార్మికులకు హెచ్చు వేతనాలిచ్చి, దయాహృదయంగా ప్రవర్తించి, వారి ప్రతిభను గుర్తించి తగు గౌరవము యిచ్చినట్లయితే అట్టి యజమానికి కార్మికులు పెట్టనికోటగా వుంటారు యజమానికి ఎప్పుడు దూరంగా పోరు.[28] యజమానికి కార్మికులకు వ్యక్తిగత సంపర్కము లేకపోవటం కార్మిక తగాదాలకు గల కారణములో ముఖ్యమైనది. యజమాని తన పనివాడు చేసిన మంచిపనిని శ్లాఘిస్తూ అతనితో కులాసాగా మాట్లాడుతూ అతని బాగోగులను గురించి పట్టించుకునేవాడైతే అట్టి యజమాని పట్ల కార్మికుడు గౌరవమర్యాదలతోనూ, విశ్వాసంతోనూ మెలగుటయేగాక యజమానికి కలిగే యిబ్బందులలో సాయపడడానికి ప్రయత్నిస్తాడు. దాదాపు వేయి సంవత్సరాలకిత్రం శుక్రాచార్యులవారికి యిట్టి సదభిప్రాయాలు కలగటంవల్లనే కార్మిక సంబంధాల విషయంలో ప్రయోజనాత్మకమైన సూత్రాలు ప్రవేశపెట్టి పారిశ్రామిక శాంతికి గట్టి పునాదులు వేశాడు. ఇరుపక్షాలలోనూ అన్యోన్యభావాలను కలిగించి పెంపొందించటానికి ప్రయత్నించాడు. యజమాని యిబ్బందిలో వున్నప్పుడుగూడ అతనిని

విడిచి వెళ్ళకుండా వున్నవాడే వుత్తమ కార్మికుడనీ, తన కార్మికులకోసం అవసరమైతే ప్రాణత్యాగం చెయ్యటానికిగూడ సిద్ధపడేవాడే వుత్తమ యజమాని అనీ శుక్రాచార్యుడు నిర్వచించాడు.[29] తన పనివారల గురించి శ్రద్ధ తీసుకునే యజమానిని విడిచి వెళ్ళటానికి కార్మికులకు అనువైన కారణము వుండదు.

యజమానులకు కార్మికులకు మధ్య సత్సంబంధాలు నెలకొల్ప డానికై యితర న్యాయవేత్తలుగూడ అనేక సూత్రాలు యేర్పరిచారు. అయితే యీ విషయంలో శుక్రాచార్యుడు చేసిన యేర్పాట్లు విశేషించి చెప్పుకోదగినట్లుగా వున్నాయి.



# ఎనిమిదవ అధ్యాయము

## సాంఘిక సంరక్షణ

శ్రేయోరాజ్యము, సాంఘికసంరక్షణ పథకాలనేవి యీనాటి భావాలవలె కనిపించినా భారతప్రజలకు క్రీ. పూ. మూడవ శతాబ్దమునాటికే వీటినిగురించి తెలుసును. ఉద్యోగానంతర భరణములు, వికలాంగ సౌకర్యాలు, అనారోగ్య, బాలింత సౌకర్యాలు, ప్రావిడెంటు ఫండు, పోషణభత్యాలు మొదలైన యేర్పాట్లు ఆనాడువుండేవి. ఇవ్వన్నీ ప్రధానంగా ప్రభుత్వోద్యోగాలవారికే పరిమితమై వుండేవిగాని, ప్రయివేటు యజమానులుగూడ తమ ఉద్యోగులకు, వారి కుటుంబాలకు పోషణ సదుపాయాలు కల్పించిన అవకాశాలు లేకపోలేదు. అనాదిగా వస్తున్న హిందువుల సమిష్టికుటుంబ వ్యవస్థలో వితంతువులకు, వృద్ధులకు, అనాథలకు సంరక్షణ యిమిడివుండేది.

న్యాయశాస్త్రములోనూ, రాజకీయశాస్త్రములోనూ ప్రవీణులైన సాంఘిక సంక్షేమ పథకాలు యేర్పాటుచేసిన ప్రాచీన మహానుభావులలో కౌటిల్యుడు, మనువు, శుక్రాచార్యుడు ముఖ్యులు. వీరిలో శుక్రాచార్యుడు చేసినకృషి విశేషంగా చెప్పుకోతగినట్టిది. శుక్రనీతి రచింపబడిన కాలములో కార్మికుల కొరత మిక్కుటంగా వుండేదని, అందువల్లనే శుక్రుడు కార్మికులకోసం అంతవిరివిగా సూత్రాలు ప్రతిపాదించాడని కొన్ని వర్గాలవారు చెబుతుంటారు. ఈ విషయములో అనేక భిన్నాభిప్రాయాలున్నాయి. శుక్రాచార్యునికి కార్మికులకు మంచిచేయాలనే కోర్కె సహజంగానే వుండేదని శుక్రనీతిలోని కొన్ని శ్లోకాలద్వారా తెలుస్తున్నది[1].

## అనారోగ్య సౌకర్యాలు

అనాదికాలంనుంచి మనుష్యులు రోగాలకు గురిఅవుతూనే వున్నారు. కార్మికులు తరుచుగా—ఒక్కొక్కప్పుడు రోజులతరబడి—అనారోగ్యమువలన పనికి రాలేకపోవడము, అందుకు ఫలితంగా జీతాలే గాక ఉద్యోగాలే పోగొట్టుకోవడం జరిగేది. ఈ యిక్కట్టునుంచి కార్మికులను తప్పించాలనే వుద్దేశంతో ప్రాచీన న్యాయవేత్తలు కొన్ని యేర్పాట్లుచేశారు. కార్మికులు పనికితిరిగివచ్చి తమపనిని పూర్తిచేసినట్లయితే వారు పనికిరాలేని రోజులకుకూడ జీతమివ్వాలని కొందరన్నారు. యజమానినుండి అనుమతిపొంది శెలవులో వున్నవారికి మాత్రమే జీతమివ్వాలని మరికొందరు అభిప్రాయపడగా, న్యాయసమ్మతంగా వుండేమేరకు జీతాలు, ఉద్యోగాలు తిరిగి యిచ్చేయాలని మరే కొంతమంది ఆదేశించారు. అనారోగ్యమువలన పనికిరాలేని కార్మికుడు తర్వాతవచ్చి తనపనిని పూర్తిచేసినట్లయితే అతని అనారోగ్యకాలానికి జీతమివ్వాలని మనువు సూచించాడు[2]. ఆరోగ్యం చేకూరిన మీదట వచ్చి పని పూర్తిచేయకపోతే ఎట్టి జీతము యివ్వనక్కరలేదని కూడ ఆయన అన్నాడు[3]. అనారోగ్యకాలంలో జీతము లభించనందువలన కార్మికులకు యిబ్బందికలిగినా ఆ జీతము తర్వాత లభించ గలగటమనేది మెచ్చుకోదగిన విషయమే. ఈనాడు లభించే అనారోగ్యసదుపాయాలకు దీనికీ సామ్యంవున్నది. వారంరోజులు అనారోగ్యంగావున్న కార్మికుని జీతంలో ఎట్టి కోత పెట్టరాదని శుక్రాచార్యుని సూత్రము[4]. అంతకు మించిన అనారోగ్యమైనట్లయితే అయిదేండ్లకుపైబడి ఉద్యోగము చేసే వారికి మూడునెలల వరకు జీతములోని నాల్గింట మూడోవంతు చెల్లించాలి. ఎట్టి పరిస్థితిలోనూ అనారోగ్యసదుపాయముగాని, జీతముగాని ఆరునెలలకుపైగా వర్తించదు[5]. ప్రాచీన భారతదేశములో అనారోగ్య సౌకర్యాలుండేవనటానికి యీ సాక్ష్యాలుచాలు.

## బాలింత సౌకర్యాలు

స్త్రీకార్మికులకు అనారోగ్య సదుపాయాలతోబాటు బాలింత సౌక ర్యాలుగూడా వుండేవి. స్త్రీలకు గర్భధారణ కాలములో అవసరమయ్యే సదుపాయాలన్నీ కలిగించాలని యజమానులకు వుత్తరువులుండేవి. గర్భిణులైన స్త్రీదాసిసలను అమ్మేయజమానులు అట్టిస్త్రీలకు తగు సౌకర్యాలు యేర్పరచాలని కౌటిల్యుని అర్థశాస్త్రము శాసిస్తున్నది[6]. కౌటిల్యుని చట్టాలప్రకారము యీ విషయములో లోపముకలిగించిన వారికి కఠినంగా శిక్ష యివ్వబడేది.

## వార్ధక్య సౌకర్యాలు, పెన్షన్లు

ప్రాచీన కాలములో వృద్ధాప్యముకొరకు ప్రత్యేకంగాకొన్ని సదుపాయాలుండేవని, ముఖ్యంగా ప్రభుత్వోద్యోగాలలో వుండేవారికి ప్రావిడెంటు ఫండు, పెన్షన్లు అనే రెండు అవకాశాలు కలిగించ బడేవని శుక్రనీతివలన తెలుస్తున్నది[7]. నలభైయేండ్లకుపైగా వుద్యోగం చేసిన వారికి జీతంలో సగానికిసరిపోయే మూల్యాన్ని పెన్షనుగా యివ్వాలనే భావం యిక్కడ నిర్దుష్టంగా గోచరిస్తుంది. జీతములోకొంత భాగము ప్రావిడెంటు ఫండుకై పట్టుకోటంగూడా వుండేది[8]. కార్మికుని జీతము నుండి నాలుగోవంతో, ఆరోవంతో పట్టుకుని రెండు మూడేండ్లతర్వాత అందులోసగమో, పూర్తిగానో అతనికిచ్చివేయాలని యేర్పాటయింది. అంటే తమభవిష్యత్తుకొరకై తప్పనిసరిగా కొంతనిలువ జేసుకోవాలని కార్మికులపై నిర్బంధముండేదన్నమాట. అందుకనే ప్రావిడెంటు ఫండు, పెన్షన్ అనేవి మనపూర్వులకు తెలియని విషయాలు కావని చెప్పడంలో పొరపాటేమీలేదు.

కుటుంబపెన్షన్లు, పోషణభత్యాలు

ఈ రెండింటికిగూడ కౌటిల్యుడు, శుక్రాచార్యుడు సూత్రాలుచేసి వుంచారు. ఇందువలన భుక్తి సంపాదించుకు వచ్చేవాడు చనిపోయిన తర్వాత విధవలు, పసిపిల్లలు అనాధలుగాకుండా కాపాడేవారు. పని చేస్తూ చనిపోయినవారి జీతాలు వారిభార్యలకు, పిల్లలకివ్వాలనీ, యజమాని ప్రభువు చనిపోయిన కార్మికుని కుటుంబములోని పిల్లలమీద, వృద్ధుల మీద దయగలిగి ప్రవర్తించాలనీ, ఆకుటుంబములో జననమరణముల సందర్భముగా వారికి ఆర్థికసహాయము చేయాలనీ కౌటిల్యుడు అన్నాడు. ప్రభువుకుగాని, యజమానికిగాని యిందుకు కావలసిన ధనము కొరవడి నట్లయితే వారు అట్టిసహాయము వస్తురూపములో (భూమి, పశువులు వగైరా) చేయవచ్చునని, అయితే పెద్దమొత్తాలను బంగారం రూపములో యివ్వరాదని అర్థశాస్త్రములో వున్నది9. బహూశ యిట్టి అనాథకుటుం బాలకు శాశ్వతమైన పోషణమార్గము చూపటమే దీనివుద్దేశ్యమై వుంటుంది.

దిక్కులేని స్త్రీలను ప్రభుత్వముయొక్క నేత కర్మాగారాలలో నియోగించే విషయము "ప్రాచీన భారతములో స్త్రీలు" అనే అధ్యాయ ములో చెప్పబడింది. కౌటిల్యుడు పనిచేయకుండా జీతమిచ్చేపద్ధతిని వ్యతిరేకించటమువల్లనే వితంతువులకు, చేతగానిస్త్రీలకు, కన్యలకు, సన్యాసినులకు, శిక్షితులకు, పూర్వవ్యభిచారుణులకు, దేవదాసీలకు నూలు, జనప, వూలు, కాగితముల నుండి దారముపడితేపని కల్పించి తద్వారా వారికి వారిబిడ్డలకు ఉదరపోషణ జరిగే యేర్పాటుచేయాలని ఆదేశించాడు10.

అదేసందర్భములో కౌటిల్యుడు భర్తలుచనిపోయిన స్త్రీలను, భర్తలు విదేశాలలో వున్నస్త్రీలను, తాముపరదాలోవుండి కష్టించి భుక్తి

సంపాదించుకోదలచిన కన్యలు మొదలైనవారిని సూత్రాధ్యక్షుడు పనికి నియోగించ వచ్చునని ప్రవచించాడు[11]. ఈ విధముగా నిస్సహాయులైన స్త్రీలకు పోషణకల్పించి వారిని అనాథలై ఒకరిమీద ఆధారపడి బ్రతికేవారు గాకుండా కాపాడటమే కౌటిల్యుని వుద్దేశ్యమని గ్రహించటము కష్టముగాదు. ఇందువలన 'పనిచేయకపోతే జీతములేదు[12]' అనేసూత్రానికి గూడ భంగముకలగదు. సాంఘికసంరక్షణ పథకాలలో యిదిముఖ్యమైన పద్ధతి అని చెప్పకతప్పదు

అయితే శుక్రాచార్యుడు నలభై సంవత్సరాలు పనిచేసిన కార్మికులకు వార్ధక్యసౌకర్యాలు(పెన్షన్లు)కలిగించటమే గాక వారిమరణానంతరము వారికుటుంబాలకు పోషణభత్యాలు, కుటుంబ పెన్షన్లు ప్రవేశపెట్టాడు. కార్మికుడు మరణించినట్లయితే అతని వితంతువుకు, సత్ప్రవర్తనగల కూతుళ్లకు, మైనపుకుమారులకు అతని జీతములో సగం యివ్వాలని కొన్నిశ్లోకాలు విశదపరుస్తున్నాయి.[13]

పనిచేస్తూ చనిపోయిన కార్మికుని మైనరుకుమారునికి మైనరు వెళ్లేవరకు అతని తండ్రిసంపాదించేజీతము యిస్తూ తగు ప్రాయముగలవాడైనప్పుడు అతని యోగ్యతనుబట్టి వేతననిర్ణయము చేయవచ్చునని గూడ ఒకప్రతిపాదన చేయబడెను.[14] దీనివలన కార్మికుని కుమారునికి వుద్యోగము వంశపారంపర్యంగా లభించేఅవకాశముకలిగి తనకుతాను వుద్యోగమువెతుక్కునే యిబ్బంది తొలిగిపోయింది.

## నిరుద్యోగభీమా

ఒకవిధంగా నిరుద్యోగభీమాకు గూడ ప్రాచీనకాలంలో అవకాశముండేది. నిరుద్యోగి యెవరైనా ఒకధనికుడిపద్దకువెళ్లి 'నేను నీవాణ్ణి' అనిచెప్పుకొని తన పోషణకుగాని, జీతానికిగాని ఆధనికుడి బానిసగాచేరి

తనకు ఉద్యోగం దొరకటంతోగాని, తనయిబ్బందులు తొలగిపోవడం తోగాని ధనికుడి పోషణను వదులుకుని బానిసత్వమునుండి విముక్తుడు గావచ్చును. నిరుద్యోగబాధనుండి తప్పించుకోటానికియిది అంతగౌరవ ప్రదమయిన పద్ధతిగాకపోయినా దీనివలన క్షుద్బాధతీర్చుకునే అవకాశం మాత్రము వున్నది.

ప్రభుత్వాలు, ప్రయివేటు యజమానులేగాక పనివారలసంఘాలు గూడ తమ సభ్యులకు, సభ్యులకుటుంబాలకు సాంఘిక సంరక్షణకల్పించటానికి చేతనైనకృషిచేస్తూండేవి. దీనినిబట్టి సాంఘిక సంరక్షణ పద్ధతులు మనప్రాచీనులకు తెలియనివి గావని, ఆధునిక ప్రభుత్వాలు తమ మనోవికాసమువలన మోస్తున్నామని చెప్పుకునే పెద్దబాధ్యతలను ఆనాటి ప్రభుత్వాలు నిర్వహించివున్నాయని తేటతెల్లమవుతున్నది.



# తొమ్మిదవ అధ్యాయము

## సామూహిక వ్యవస్థలలో కార్మికులు

---

ప్రాచీన కాలంలో ఆర్థిక సంస్థ లుండటం ఎక్కువగా కార్మికుల సామూహిక వ్యవస్థలద్వారా గోచరమవుతున్నది. వీటి విలువ యీనాటికి తగ్గలేదు. ఆనాటి కార్మిక సంస్థలతో వీటిని పోల్చ వచ్చును[1]" అని ప్రొఫెసర్ కె. టి. షా అన్నారు. ఈ సామూహిక వ్యవస్థలు కేవలము ఆర్థికవిషయమైనవేగాక రాజకీయాలకు గూడ సంబంధించివుండేవి. చేతిపనివారలకు, వృత్తిపనివారలకు, చివరికి దోపిడి గాండ్రకు, గూండాలకు-గూడ సామూహిక వ్యవస్థలుండేవి. కొన్నిచోట్ల గ్రామీణ సమిష్టి సంఘాలు ప్రభువులకు సహాయకారిగా వుండి రాజ్యాంగములో పాల్గొంటూవుండేవి. వివిధ వృత్తులు అవలంబించేవారు, వారి సామూహిక ప్రయోజనాలకోసమై యిట్టి సమిష్టి సంఘాలు ఏర్పరచుకునేవారు. ఈ సంఘాలకు తమతమ కార్యక్షేత్రాలలో సర్వాధికారాలు వుండేవి. ప్రస్తుతం మనము కార్మికుల, చేతిపనివారల సామూహిక వ్యవస్థలనుగురించి చర్చించవలసివున్నది. ఈ చర్చలో యితర వ్యవస్థల విషయం వుల్లేఖనకు రావచ్చును. వృత్తిపనివారు, చేతిపనివారు కార్మికులలో జమకట్టబడడానికి రెండు ముఖ్యకారణాలున్నాయి. మొదటిది, వీరికి సామూహిక వ్యవస్థలలో వాటాలున్నప్పటికీ వారు వారి వృత్తి పెద్దలక్రింద జీతానికి పనిచేసేవారు కావటం. రెండవది వీరు వుత్పత్తి సాధకమైన శక్తిని వ్యయం చేసేవారు కావడం.

ఋగ్వేద కాలములో యీ సామూహిక వ్యవస్థలున్నాయనటానికి నిర్దుష్టమైన సాక్ష్యాలేమీ కనబడవుగాని ఆ వేదములోని కొన్ని పంక్తుల వలన క్రీ. పూ. 800 సం.కు పూర్వమే యీ వ్యవస్థలుండేవని స్ఫురణ కలుగుతున్నది. (ఋగ్వేదం-5-53: 10-34; యజుర్వేదం 23-19.1). బృహదారణ్యకవుపనిషత్తు (1.4-12)లో గూడ వీటినిగురించి ప్రసక్తి వున్నది. వేదాల తర్వాత కాలంలో ఆర్థిక రంగములో ముఖ్యంగా వ్యాపారులకు, చేతిపనివారికి సంబంధించిన సమిష్టి సంఘాలు బాగా పెంపొందాయని తెలుస్తున్నది. ఇటువంటివి 18 సంస్థ[2] లుండేవని మూగపక్క-జాతకములో వున్నదిగాని శ్రీ ఆర్. సి. మజుందార్ తన "ప్రాచీన భారత దేశంలో సామూహిక జీవనం"[3] అనే గ్రంథములో 27 సంస్థల పేర్లు వివరంగా వ్రాసివున్నారు. వేదాల తర్వాత కాలములో యీ క్రింది వృత్తులవారికి సామూహిక సంఘా లున్నట్లుగా జాతకాలద్వారా యితర పౌరాణిక గ్రంథాలద్వారా మనకు అవగత మవుతున్నది.

(1) కర్రపనివారు (పడ్రంగులు, బీరువాలు చేసేవారు, చక్రాలు తయారు చేసేవారు, ఇళ్లుకట్టేవారు, ఓడలు నిర్మించేవారు, అన్నిరకాల శకటాలు తయారుచేసేవారు.)

(2) లోహపు పనివారు (వెండి, బంగారంతో సహా)

(3) రాతిపనివారు.

(4) తోలుపనివారు.

(5) దంతపు పనివారు.

(6) నీళ్ళ వంపులను కలిపేవారు.

(7) వెదురు పనివారు (వానకరులు)

(8) కంచరి పనివారు (కానకరులు)

(9) ఆభరణాలు చేసేవారు.
(10) పద్మశాలీలు.
(11) కుమ్మరులు.
(12) నూనె తీసేవారు (తిలపిశకులు)
(13) బుట్టలు చేసేవారు, తుంగపని చేసేవారు.
(14) రంగులద్దేవారు.
(15) చిత్రలేఖనము చేసేవారు.
(16) ధాన్యం వ్యాపారాలు.
(17) కర్షకులు.
(18) బెస్తవారు.
(19) కసాయిలు.
(20) మంగలివారు, అలంకారకులు.
(21) పూలమ్మేవారు, మాలలల్లేవారు.
(22) ఓడలు నడిపేవారు.
(23) గోపాలకులు
(24) వ్యాపారులు, ఊళ్లుతిరిగి వర్తకం చేసేవారు.
(25) దొంగలు, దోపిడిగాళ్ళు.
(26) అడవులలో ప్రయాణించేవారిని రక్షించే రక్షకభటులు.
(27) వడ్డీ వ్యాపారులు.

మహాభారతములోని వనపర్వము (248-16), శాంతిపర్వము (54-20), రామాయణంలోని అయోధ్యకాండ (123)లో వుల్లేఖించబడిన సైనికుల సమిష్టి సంఘాలనుగూడా కలిపితే యీ జాబితా పూర్తవుతుంది.

కీ9. పూ. ఆరు, ఏడు శతాబ్దాలనాటికే యీ సామూహిక వ్యవస్థలు సమాజంలో ముఖ్యాంశాలుగా వుండేవని అనేక కథనాలను బట్టి తెలు

స్తున్నది. బుద్ధుని కాలములో పనివాండ్ల వ్యవస్థలకు, వ్యాపారుల వ్యవ స్థలకు స్పష్టమైన తేడా కనిపించేదని డాక్టర్ రిచార్డ్ ఫిక్ భావించాడు. ఎందువల్లనంటే వ్యాపారులు తమలో పెద్ద (జర్థకుడు) వాని అధ్వర్యంలో స్థాపించుకున్న కార్పొరేషన్లు అంత అభివృద్ధి జెందజాలకపోగా పని వాండ్లు వారు యేర్పరచుకున్న సమాఖ్యలద్వారా వృత్తి పారంపర్యము, పరిశ్రమలలోని వివిధ శాఖలు తమతమ ప్రాంతాలలో స్థిరపడిపోవడం వంటి ప్రత్యేకతలను నెలకొల్పుకున్నారు. పరిశ్రమలు స్థానీయమై పోవడం తద్వారా పనివారు ఒక్కొక్కచోట పోగుబడిపోవడం సాధా రణ విషయాలుగా పరిణమించాయి. ఇట్లా ఎంతవరకు వచ్చిందంటే ఒక పట్టణములో కొన్ని బజార్లు, కొన్ని ప్రాంతాలేగాక కొన్ని గ్రామా లకు గ్రామాలే ఒక్కొక్క పరిశ్రమకు సంబంధించిన కార్మికులతో నిండిపోయేవి. డాక్టర్ రిచార్డ్ యొక్క యీ భావాన్ని సముద్ర-వణిజ జాతకమువంటి జాతకాలుగూడ స్థిరపరిచాయి.

క్రీ. పూ. అయిదునుండి మూడవ శతాబ్దమువరకు సామూహిక వ్యవస్థలు బాగా అభివృద్ధిపొంది స్వతంత్రాధికారాలను సంపాదించు కున్నాయి. ఉదాహరణకు గౌతమ ధర్మసూత్రములో కర్షకులు, వణి జులు, గోపాలకులు, వడ్డీవ్యాపారులు, చేతివనులవారు తమ వర్గాల నడవడికోసం సూత్రాలు చేసుకోవచ్చని వ్రాసివున్నది[4]. తగాదాలు వచ్చినప్పుడు ఆ వర్గముయొక్క పెద్దనుండి యదార్థస్థితిని తెలుసుకున్న మీదటనే ప్రభువు తన తీర్పు యిచ్చేవాడు. చేతివనులవారు, వ్యాపారులు మొదలైనవారియొక్క సమిష్టి సంఘాలు సర్వతంత్రముగా వుండేవని వారి ఆచరణకొరకు ఆ వ్యవస్థలు విధి నిషేధాలను యేర్పాటుచేసేవని యిందువలన తేటతెల్లమవుతున్నది. పైగా రాజ్యాంగ యంత్రములో యీ వ్యవస్థలు ఒక అంగముగా వుండి వ్యక్తుల జీవనాభివృద్ధికి కావల

సిన పరిస్థితులను కల్పించటములోనూ, పెంపొందించటంలోనూ ప్రభు వుకు సాయంగా వుండేవి.

క్రీ. పూ. మూడవ శతాబ్దానికి జెందినవాడుగా భావించబడే కౌటిల్యుడు తన 'అర్థశాస్త్రము'లో యీ వ్యవస్థలు సక్రమంగా నడిచేం దుకు సూత్రాలు చేశాడు. చేతిపనివారల, కార్మికుల సమిష్టి సంఘాలపై అజమాయిషి చేయడానికి ముగ్గురు 'ప్రదేష్ట'లతో కూడుకున్న సమితు లుండాలనీ, ప్రవేశ రుసుమును నమ్మకస్తులుగా అగ్రసభ్యుల వద్దగాని, వర్గనాయకుని వద్దగాని వుండాలనీ, పేర్కొన్నాడు.[5,6] ఈ విధులను నిక్షేపముగా వుంచి బహుశః చెల్లించినవారికి అవసరమైనప్పుడు తిరిగి యిచ్చివేయాలని వుద్దేశింపబడినట్లు తెలుస్తున్నది[7]. ఈ సమితుల ఆధ్వర్యంలో పనివాండ్లు ఏదైనా పని ప్రారంభించవచ్చును. అంతకు ముందుగానే ఆ పనిని, ఆ పని చేయవలసిన స్థలమును, సమయమును, నిశ్చయించుకోవాలి[8]. పని షరతులను నిశ్చయించుకోలేకపోయినవారికి, సమయానికి పనికి రాకపోయినవారికి వారి జీతములో చతుర్థ భాగము నుండి, సగభాగముపరకు అపరాధం విధించబడుతుంది[9]. అయితే ఏదైనా క్రూరమృగము అడ్డుతగలటంవలనగాని, విధివశాత్తు కలిగిన అవాంతరాలవలనగాని, పనికిరావటంలో ఆలస్యం జరిగితే క్షమించవచ్చును[10].

తన తప్పువలన కలిగిన నష్టాన్ని కార్మికుడే భరించాలి.[11] ఏదైనా పనిని తప్పుగా జేసినట్లయితే అతనికి జీతమివ్వకపోవటమేగాక దానికి రెట్టింపు మూల్యము అపరాధం విధించబడగలదు[12]. ఆరోగ్య వంతముగాను, శరీరపుష్టితోనూ వున్న కార్మికుడు పనిని అసంపూర్ణముగా విడిచివెళ్ళరాదు. అట్లా విడిచివెళ్ళిన వారికి పన్నెండు పణముల అప రాధం విధించబడేది[13]. ఎందుకంటే ఎవరికి ఇష్టము వచ్చినట్లు వారు

పనివిడిచి వెళ్ళటానికి వీలులేదు[14]. సామూహిక వ్యవస్థలోని సభ్యుడు మొదటిసారిగా చేసిన తప్పునుగానీ, దొంగతనముగానీ, అది ఒప్పు కున్నట్లయితే క్షమించి విడిచిపెట్టవచ్చును. కాని ఆ తప్పునే మళ్ళా చేసినా, తీవ్రమైన నేరము చేసినా అతడిని 'నేరస్థుని'గా యెంచ వలసినదే[15].

సామూహిక సంఘము ఆర్జించినదంతా అందులోని సభ్యులకు చెందుతుంది. దాన్ని వారు సమంగా పంచుకోవాలి[16].

సామూహిక వ్యవస్థలనుగురించి యితర వివరాలు మనుస్మృతిలో లభిస్తాయి. అతని పూర్వులవలెనే మనువుగూడ యీవ్యవస్థ (గణము)లకు సంబంధించినవారంతా పరస్పరపట్ల విశ్వాసపాత్రంగా వుండాలని కోరాడు. తాము ప్రమాణంచేసి స్వీకరించిన నియమావళికి కట్టుబడి వుండలేకపోవ టము, పనిలో చిత్తశుద్ధి లేకపోవటము, వ్యవహారాలలో నిజాయితీ లేకపోవటము తీవ్రమైన, శిక్షార్హమైన నేరాలు. ఇట్టి నేరస్థులకు అప రాధాలు, జైలుశిక్షలేగాక సంఘ బహిష్కరణ గూడ విధించవచ్చును[17].

మనువు తర్వాత వారైన విష్ణువు, యాజ్ఞవల్క్యుడు మొదలైన వారు యిటువంటి అభిప్రాయాలనే వెలిబుచ్చియున్నారు. సామూహిక సంఘముయొక్క ఆస్తులను, నిధులను తస్కరించినవారి ఆస్తిని వశ పరచుకోవటమేగాక వారిని దేశంనుండి తరిమివేయాలని యాజ్ఞ వల్క్యుడు అన్నాడు. తాము పాటించవలసిన సూత్రాలను బుద్ధిపూర్వ కంగా వుల్లంఘించినవారికి, ముందు ప్రమాణము చేసినట్లుగా తమ విధులను ఆచరించనివారికి ప్రథమశ్రేణి శిక్ష విధించాలనిగూడ అన్నాడు[18].

మహాభారతములోని వివిధాధ్యాయాలలోగూడ యీ సామూహిక వ్యవస్థనుగురించి వుల్లేఖింపబడివున్నది. రాజవంశాలు యిట్టి సమాఖ్యలను గుర్తించి బలపరిచేవని భారతములోని కొన్ని భాగాలద్వారా తెలుస్తున్నది[19].

సమిష్టి వ్యవస్థలపట్ల తన ధర్మం నిర్వహించకపోవటమనే పాపానికి పరిహారమే లేదని మహాభారతములో చెప్పబడి వున్నది[20].

నారద బృహస్పతుల రచనలలోగూడ యీ వ్యవస్థలను గురించిన సాక్ష్యాలు లభిస్తున్నాయి. వీటిప్రకారం యీ వ్యవస్థలు సంపూర్ణమైన స్వాతంత్ర్యన్ని తమ వ్యవహారాలనుగురించిన సూత్రాలు తామే చేసుకునేవి. రాజ్య శ్రేయస్సుకు వ్యతిరేకమైనట్టివైతే తప్ప సాధారణంగా ప్రభువులు యీ వ్యవస్థలలోని సభ్యులు పాటించవలసిన విధులు, నడవడి, జీవన విధానమునకు సంబంధించిన యీ సూత్రాలన్నింటిని ఆమోదించేవారు. రాజ్య శ్రేయస్సుకు విరుద్ధమైన యే నియమాలను తయారు చేయరాదని యీ వ్యవస్థలను ప్రభువులు కట్టడి చేసేవారు[21]. చట్ట విరుద్ధంగానూ, ఒకరికి ప్రమాదం కలుగచేసేదిగానూ వున్న యే పని చేయకుండా ప్రభువులు ఆటంకపరచేవారు[22].

ఈ సమిష్టి వ్యవస్థలలో అన్యోన్య సహకార సంబంధాలు పెంపొందించే వుద్దేశ్యంతో నారదుడు యీ వ్యవస్థలలో అంతరంగికమైన తగువులు పుట్టించే వ్యక్తులను తీవ్రంగా శిక్షించాలనీ, లేకున్నట్లయితే వీరు అంటువ్యాధివలె వ్యాపించగల ప్రమాదమున్నదనీ నొక్కిచెప్పాడు. సుభిక్షంకోరే యే ప్రభువుకైనా నీతికి విరుద్ధమైన పని జరగకుండా చూడటం ముఖ్య కర్తవ్యము కాగలదని గూడ నారదుడన్నాడు[23].

అవాంతరాలను యెదుర్కొనే నిమిత్తమై పరస్పరాంగీకారముతో చేతిపనులవారు సామూహిక వ్యవస్థలు నిర్మించుకోవచ్చని బృహస్పతి అభిప్రాయపడ్డాడు[24]. పరస్పర విశ్వాసమున్నప్పుడే యిట్టి అంగీకారాలు సాధ్యమవుతాయి. పత్రాలమీద వ్రాసుకోవడం ద్వారాను, మధ్యవర్తి సమక్షంలో ఒప్పందాలు చేసుకోవడంద్వారానూ, లేక కఠోర పరీక్షకు నిలబడడంద్వారానూ యిట్టి విశ్వాసం చేకూరుతుంది. విశ్వాసం కుదిరేవరకు యేపనీ ప్రారంభించరాదు[25]. అతిప్పృద్ధులను, అతి లేప్రియమువారిని, ఈర్ష్యాపరులను, మాటకు కట్టుబడి వుండనివారిని, అహంకార స్వభావులను—వీరు విశ్వాసపాత్రంగా వుండజాలరు గాబట్టి—యీ వ్యవస్థలలో సభ్యులుగా చేర్చుకోరాదని గూడ బృహస్పతి హెచ్చరించాడు[26].

సామూహిక వ్యవస్థయొక్క యాజమాన్యము దాని పెద్ద చేతిలో వుండేదని అతని సహాయక, సమర్థకులుగా కొంతమంది సభ్యులుండే వారని బృహస్పతి తెలిపియున్నాడు. మంచి కుటుంబాలకు చెందినవారు, వేదజ్ఞానము కల్గినవారు, నమ్మకస్థులు, ప్రజ్ఞా సామర్థ్యాలుగలవారు మాత్రమే యీ వ్యవస్థలకు పెద్దలుగా వుండటానికి అర్హులు[27]. అయితే యిట్టి నాయకుడు నియంతగా వుండడు. సమాఖ్య సభ్యులనుండి ఏరుకున్న యిద్దరు, నల్గురు లేక అయిదుగురు వ్యక్తులు యీతనికి సహాయకులుగా వుంటారు[28]. బృహస్పతి తన రచనలలో గ్రామ వ్యవస్థలను ప్రత్యేకంగా పేర్కొన్నప్పటికీ, చేతిపనివారల సమాఖ్యలకు గూడ యీ సూత్రాలు వర్తించేవి.

ఒప్పందాన్ని భగ్నపరచినందుకు, కార్యసాధన సూత్రాలను వుల్లంఘించినందుకు, అంతః కలహాలను రెచ్చగొట్టినందుకు తీవ్రమైన శిక్ష విధించబడేది. మామూలు అపరాధంనుండి, బహిష్కరణ, ఆస్తి వశపరచుకోవడందాకా యీ శిక్ష వుండేది.

తనకు సాధ్యమై వుండిగూడ ఒప్పందానికి కట్టుబడి వుండని వారిని వూరినుంచి బహిష్కరించి వారి ఆస్తి స్వాధీనం చేసుకో బడేది[29]. తోటివారితో పోట్లాటలకు దిగినవారికి, తన పనిని నిర్లక్ష్యంగా చేసినవారికి యిరవై నాలుగు 'నిష్కము'ల అపరాధం విధించేవారు[30]. సమాఖ్య సభ్యులలో పేచీలు పుట్టించడం, సమాఖ్యను, ప్రభువును శతృభావంతో వ్యతిరేకించడం అప్పటిలో వున్నచట్టాల ప్రకారం హెచ్చుశిక్షార్హములైన నేరాలు[31]. దుష్టభావాలుగలవారిని, ఓరిమిలేని వారినీ, వారుచేసే పనులనూ అణచివేయవలసిన బాధ్యత సమాఖ్యానాయ కులకుండేది. ఈబాధ్యత నిర్వహణలో వీరుసభ్యులపట్ల చూపే కాఠిన్య మునుగాని కారుణ్యమునుగాని ప్రభువులు సాధారణంగా ఆమోదించే వారు[32]. ఈ విధంగాగాక యితరంగా సమాఖ్యానాయకుడు సభ్యులకు కష్టనష్టాలు కలిగించినట్లయితే ప్రభువులు అట్టిసభ్యులను రక్షించి నాయ కుని ప్రవర్తనలో మార్పురానట్లయితే అతడిని శిక్షించేవారు[33]. సమాఖ్య నాయకుడికి పనివారికిమధ్య తగాదాలువస్తే ప్రభువు వారిరువురిని సామరస్యపూర్వకంగా కలిపి తిరిగి పనికిపోయేట్లు చేసేవారు[34].

కాబట్టి యీ సమాఖ్యలలో (సభ్యులే యజమానులు, కార్మికులుగా వున్నచోట్ల) వచ్చిన అంతరంగిక కలహాలను వాటినాయకులే తీర్చేవారు. కాని తగాదాలు తీవ్రరూపము దాల్చినప్పుడుగాని, నాయకులు నిష్పాక్షి కంగా వుండనప్పుడుగాని ప్రభువులు కల్పించుకుని తీర్పులిచ్చేవారు. సమాఖ్యనాయికుడు ఘోరనేరాలుచేసినా, సభ్యులలో అంతఃకలహాలు పుట్టించినా, సమాఖ్య ఆస్తిపాడుచేసినా, సభ్యులు అతనిని శిక్షించగలిగే వారు. కాత్యాయనుడు తన వివదత్నాకరములో సమాఖ్య తన నాయకుని శిక్షించే అధికారమును గురించి ప్రస్తావించి వున్నాడు (ముఖ్యాదండనే సమూహస్యైవాధి కారః॥) యాజ్ఞవల్క్యని శ్లోకము[35]ను విపులీకరిస్తు

మిత్రమిశ్రుడు కాత్యాయనుడు వ్రాసిన "సాహసీభేదకారీచ గణద్రవ్య వినాశకః॥" అనేవాక్యాన్ని సంస్మరించాడు. సమాఖ్యానాయకుడు గాని, మరెవ్వరుగాని శిక్షార్హమైన నేరముచేసినా, సమాఖ్య శ్రేయస్సుకు భగ్నకరంగా వ్యవహరించినా, వారిని సమాఖ్యనుంచి తొలగించి అవిషయము ప్రభువుకు విన్నవించుకోవచ్చునని దీనియర్థము. సమాఖ్యలు తమకు తగినబలము లేదనుకున్నప్పుడే ప్రభువు తానుగా శిక్షవిధించగలడు. న్యాయమైన మాటలు మాట్లాడినందుకు ఎవరికైనా సమాఖ్యానాయకుడు హానికలిగించినా, మాట్లాడుతుండగా ఆటంకపరచినా నిందించినా అతడికి శిక్షపడేదని వివద్రత్నాకరములో ఒకానొకచోట "యుక్తి యుక్తంచయో హన్యాద్వక్తుర్యోనావకాశదః। అయుక్తం చైవయోబ్రూయాత్ ప్రాప్నుయాత్ పూర్వసాహసః॥" అని కాత్యాయనుడు అన్నాడు. బహుశః ఏసభ్యుడైనా తనమీద అభియోగంతెచ్చి సభలోమాట్లాడుతున్నందుకు మండిపడి నాయకుడు ఆ మాట్లాడేవానిని నిందించటం గురించి యీ ప్రస్తావన వచ్చివుండవచ్చును. సమాఖ్యానాయకుల విస్తీర్ణాధికారాల నుండి సభ్యులకు రక్షణవుండేదని, ప్రజాస్వామ్యం సంరక్షింపబడేదని దీనివలన మనకు తెలుస్తున్నది.

తదుపరి శతాబ్దములలోగూడ యీ సమాఖ్యల గురించిన ప్రస్తావనలు మనకు లభిస్తున్నాయి. ఇందోరులోని స్కందగుప్తుని క్రీ. పూ. 465నాటి రాగిఫలకశాసనము, మాండోస్రేరులోని కుమారగుప్తుని రాతి శాసనము, గ్వాలియర్‌లోని వేళాభట్టస్వామి దేవాలయములోని క్రీ. శ. 877కు జెందిన బంధువర్మ శాసనము, శ్రీహర్షుని రాతి శాసనము, సియాదోని శాసనము, అదేకాలమునకు జెందిన చేది లక్ష్మణరాజు యొక్క కారితలై రాతి శాసనము సామూహిక వ్యవస్థల వునికికి ఎంతో సాక్ష్యమిస్తున్నాయి.

పైన చర్చించిన దాన్నిబట్టి గ్రామసమాఖ్యలు, రాజకీయసమాఖ్యలే గాక చేతిపనివారలకు, కార్మికులకుగూడ సమిష్టిసంఘాలుండేవని తీర్మానించుకోవచ్చును. సమాఖ్యలసభ్యులే వాటియజమానులు. ఉత్పాదక పరిశ్రమలలో వారు తమ పెట్టుబడినీ, కష్టాన్నీ ధారపోసేవారు. అంటే వారేయజమానులు, వేతన సంపాదకులు గూడా. పరస్పరవిశ్వాసంతో ప్రతివారు అందరిమంచికోసం పనిచేసేవారు. జీవితానికి, ఆస్తికి సామూహికరక్షణ, మనోవాక్కర్మలలో స్వేచ్ఛ, పేదరికము, కొరతనుండి విముక్తియివే సామూహికవ్యవస్థల ముఖ్యలక్ష్యాలు, సభ్యులు జీతంకోసం పనిచేసినప్పటికీ వారు సంపాదించినదీ, వుత్పత్తిచేసినదీ, సాధించినదీ అంతాఅందరికీ చెందుతుండేది. పనిలోనూ, నిత్యజీవితములోనూ నికటంగా కలిసివుండటం వలన యీ సమాఖ్యల సభ్యులలో ఏకకుటుంబీకుల లక్షణాలెక్కువగా వుండి తద్వారా ప్రతికార్మికుడి వ్యక్తిత్వానికి పరిపూర్ణమైన గుర్తింపులభించటమేగాక అతడు 'భీతి తత్త్వము'నకు గురికాకుండా వుండేవాడు. నిస్సహాయత అనే దౌర్బల్యానికి లోను గాకుండావుంచే ఆత్మవిశ్వాసము ప్రతికార్మికునిలోనూ ఆవహించి వుండేది.

———

# అనుబంధము



## ఒకటవ అధ్యాయము.

1. వి. ఎ. స్మిత్ "ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా" మూడవ ముద్రణ 438-444 పుటలలో.

2. హెచ్. సి. చక్లధర్ "సోషల్ లైఫ్ ఇన్ ఏన్షియంట్ ఇండియా" 2 వ ముద్రణ (1954) 107 వ పుట,

మరియు

3. మజుందార్, రే చౌదరి దత్తా "ఏన్ అడ్వాన్స్డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా" 35, 81 పుటలు.

4 భారతదేశ విదేశ వ్యాపారంగురించి చాలా ఆధారాలున్నాయి. "క్రీ. శ. మూడవశతాబ్దములో వ్రాయబడిన "ఫుసస్సు-సూచువన్" అనే చైనా పుస్తకములో క్రీ. పూ. 53 ప్రాంతములో కౌండిన్యుడు ఇండోచైనాలో ఒకభారతీయ గ్రామం ఏర్పర్చగా అది శీఘ్రంగా అభివృద్ధిజెంది ఆ ప్రదేశములో ఒక గొప్ప విదేశ వ్యాపార కేంద్రంగా మారింది" అని హెచ్. సి. చక్లధర్ "ప్రాచీన భారతంలో సామాజిక వ్యవస్థ" లోని 105 పుటలో వున్నది.

5. మజుందార్, రే చౌదరి దత్తాలచే విరచితమైన "ఏన్అడ్వాన్స్డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా" (మాక్మిలన్స్, 1953) లో భారతదేశము సిరియా, ఈజిప్టు, మరియు యితర పాశ్చాత్యదేశాలతో వాణిజ్య

సంబంధాలు కలిగివుండేదని తెలుపబడివున్నది. రెండవ యూర్జెటీస్ (క్రీ. పూ. 145-116) కాలంలో భారత నావికులు బహుశః వర్తకంకోసమై సముద్రయానం చేసిన ఉదంతం కూడ వారు తెలుపుతున్నారు (136 వ పుట).

తన "ప్రాచీన భారతదేశము-చరిత్ర, సంస్కృతి'' (ఏషియా పబ్లిషింగ్ హౌజ్, బొంబాయి, 1954) లో డా॥ బి. జి. గోఖలే జాతకాల కాలానికిజెందిన వ్యాపార సంబంధాలను వివరించారు. ఆయన భరుకచ్ఛ (బ్రోచ్), సుప్పరక (సోపర), తామ్రలిప్తి (తామ్లుక్), పల్లవ అనే రేవులద్వారా ప్రాచీన భారతీయులు యీ వ్యాపారం జరిపేవారు అని తెలిపారు.

6. అథర్వణవేదమునకు విట్నీ అనువాదం-సంపుటి 7, పుట 249.

7. ప్రాచీన భారతసాహిత్యంలో బహుశః ప్రప్రథమంగా పురుష సూక్తంలో (ఋగ్వేదం X—90) బ్రాహ్మణ, రాజన్య, వైశ్య, శూద్ర అనే పదాలు కనిపిస్తున్నాయి.

8. శూద్రులుకూడ చేతివృత్తుల నవలంబించారనటానికి ఆధారాలున్నాయి. "శూద్రులు చివరివారు. వారు అనార్యులు, కష్ట పరులు. వారు కూలికి చేతిపనులు చేయడానికి కుదిరేవారు" అని ర్హైయిస్‌డేవిడ్ వ్రాశారు. "బౌద్ధ భారతం" పుట 39. (సుశీల్ గుప్త, (ఇండియా, లిమిటెడ్) వారి ప్రచురణ).

9. డా॥ రాధాకుముద్‌ముఖర్జీగారి "హిస్టరీ ఆఫ్ సివిలిజేషన్ ఇన్ ఏన్షియంట్ ఇండియా" సంపుటి 1, పుట 236.

10. ఎస్. రాధాకృష్ణ "ఈస్టర్న్ రిలిజిన్ అండ్ వెస్టర్న్ థాట్ " (1939) పుట 373.

11. కె. ఎం. పణిక్కర్ "ఏ సర్వే ఆఫ్ ఇండియన్ హిస్టరీ" ఆసియా పబ్లిషింగ్‌హౌజ్, బొంబాయి (1954) - పుట 13.

12. "దుశ్శీలోపిద్విజః పూజ్యో నతు శూద్రోజితేంద్రియః।కః పరిత్యజ్య గాం దుష్టాం దుహేచ్ఛీలవతీం ఖరీమ్" – పరాశర స్మృతి–8.33

"దుర్వృత్తా వా సువృత్తా వా ప్రాకృతా వా సుసంస్కృతా బ్రాహ్మణా నావమంతవ్యా భస్మచ్ఛన్నా ఇవాగ్నయః"–గౌతమ స్మృతి.

"అవిద్వాన్ బ్రాహ్మణోదేవః పాత్రం వై పావనంమహత్, విద్వాన్ భూయస్తరోదేవః పూర్ణసాగరసన్నిభః। ఏవంయద్వ్యాప్యవిష్ఠేషువర్తతే సర్వకర్మసు। సర్వథాబ్రాహ్మణోమాన్యో దైవతం, విద్ధితత్పరం ॥ – మహాభారతం అనుశాసనపర్వం.

13. "ఉతాపియమగీతాత్రశ్లోకా నుదాహరన్తి। శ్మశానమేతత్ప్రత్యక్షం యే శూద్రాఃపాద చారిణః తస్మాచ్ఛూద్రసమీపేతు నాధ్యేతవ్యంకదాచన ॥ వశిష్ఠస్మృతి–18. 13. గౌతమధర్మసూత్రము 16. 18, 19. ఆపస్తంభధర్మసూత్రము 1. 3. 9. 9. యాజ్ఞవల్క్యస్మృతి I–148. లో కూడా యిటువంటి నిషేధాలు న్నాయి.

14. "అథవాస్య వేదము పశ్రుణ్వత స్త్రపుజతుభ్యాం శ్రోత్రపూరణముదాహరణే జిహ్వాచ్ఛేదో ధారణోశరీరభేదః" – గౌతమ ధర్మసూత్రము 12 IV.

